శ్రీ రామాయనమః

# హరిశ్చంద్ర చరిత్రము

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

## వాసుదాస స్వామి



www.mohanpublications.com

శ్రీరామ

ఆర్యచరిత్ర రత్నావళి.

# హరిశ్చంద్ర చరిత్రము.

ప్ర థ మ ర త్న ము

వావిలికొలను సుబ్బరాయ

వి ర చి త ము



ఆంధ్రవాల్మీకి వాసుదాసస్వామి

శ్రీరామసేవాకుటీరము,ఒంటిమిట్ట కడప.

www.mohanpublications.com



తండ్రి పిల్లవాండ్రకు ఆర్యచరిత్రములు చెప్పుట.

www.mohanpublications.com

# మొ ద టి కూ ర్పు పీ ఠి క.

------------

" ఆర్యచరిత్రరత్నావళి " ప్రణాళీసూచిక ప్రకారము హరిశ్చంద్రచరిత్రము తొలుతఁ బ్రకటించితిమి. సత్యమునకంటె శ్రేష్ఠమైన ధర్మము లేకుండుటను "సత్యంవద" యనునదియే మొదటి వేదానుశాసన మగుటను దానిని దెలుపుటయందు హరిశ్చంద్ర చరిత్రమే ప్రసిద్ధమైయుండుటను ఆ చరిత్రము మొదటఁ బ్రకటింపఁ గారణమయ్యెను.

ఇందు బాలురకు సాధారణముగఁ దెలియని శబ్దములకు గ్రంథము కడపట నర్థము వ్రాయఁబడి యున్నది. బాలురెఱుంగఁదగిన కొన్ని విశేషవిషయములను వ్రాయఁబడినవి. భాష నేర్చుకొన నభిలాషగలవారికిని ఉక్తలేఖనము వ్యాసలేఖనము వ్రాయువారికిని ముఖ్యముగఁ దెలియవలసిన విషయములు కొన్ని వ్రాయఁబడిన శబ్దములయర్థము గాని వ్యాకరణ విషయముగాని మఱియొక గ్రంథమునందు వ్రాయఁబడదు. కావున వానిని నేర్చుకొనవలయును. ఇందుఁ జెప్పఁ బడిన పద్ధతుల ప్రకార మీ విషయములు నేర్చుకొనువారి కెట్టి యుద్గ్రంథ మైనను నితర సాహాయ్య మక్కఱలేక బోధపడఁగలదని మా నమ్మకము.

కావున నభిజ్ఞులును-భాషాభిమానులును-బాలురశ్రేయస్సు గోరువారును-ఉపాధ్యాయులును-పాఠశాలాధికారులును-నీపుస్తకమును బ్రచారములోనికిఁ దెచ్చి బాలురచేఁ జదివింతురుగాక యని కోరుచున్నాము.

ఇవి బాలుర కెక్కువగ నుపయోగపడుటకై యనుభవజ్ఞులగు నభిజ్ఞు లేవేని మార్గములు సూచించిన వారికి నభివాదన మొనర్చి తత్పద్ధతుల ననుసరింపఁ గలవారము.

www.mohanpublications.com

శ్రీరామచంద్రాయనమః

ఆర్యచరిత్రరత్నావళి.

# హ రి శ్చ ం ద్ర చ రి త్ర ము

ప్రథమరత్నము.

)))))))))
సత్యం వద.

ఒకనాఁటిరాత్రి భోజనమైనపిమ్మట రంగన్న,రాముడు కృష్ణుఁడు, రుక్మిణి, అమ్మణ్ణి యను బాలకులు వేడుకగా నారబయట వెన్నెలలోఁ గూర్చుండి ముచ్చటలాడుసమయంబున రుక్మిణి తండ్రినిజూచి "అప్పా! సత్యము పలుకవలయును.అసత్యమును బలుకరాదు!" అనెదవే సత్యమన నేమి? అసత్యమన నేమి? యని యడిగెను.తండ్రి యిట్లు చెప్పెను.

అమ్మాయి ! అడుగఁదగిన మంచి ప్రశ్న మే యడిగితివి.చెప్పెదను వినుము.సత్యమనఁగా నిజముచెప్పుట.ఉన్నదున్నట్టు చెప్పిన సత్యము చెప్పుటయగును.తాను జెప్పిన మాట తప్పకుండుటయు,లేనిది కల్పించి చెప్పకుండుటయు,ఒకటి మనస్సులో నెంచుకొని మఱియొకటి నోటితోఁ జెప్పకుండుటయు,తా ననుకొన్న యర్థముగాక వినువారికి మఱియొకయర్థ మగునట్లు మాటలాడకుండుటయు సత్యముచెప్పుటేయగును.ఎన్ని కష్టములు వచ్చినను, ఎన్ని నష్టములు వచ్చినను, సత్యమునే పలుకవలయును.

కృష్ణుడు- నీవింట లేనప్పుడు చదువుకొనవలసిన సమయములోనే నాడుకొంటిని.నీవు వచ్చిచదువు కొంటివా యని యడుగఁగా లేదని చెప్పిన నీవు నన్నుఁగొట్టవా?కాఁబట్టి నిజముచెప్పి దెబ్బలు తినుమనెదవా? తలనొప్పివచ్చినది చదువలేదని చెప్పి తప్పించుకొనుమనెదవా?

తండ్రి- ఏల నిన్నుఁ గొట్టుదును?

కృష్ణుడు- చదువుకొనవలసలసినప్పుడు చదువుకొన లేదని కోపము వచ్చినందున.

తండ్రి- నీవు తప్పుచెసినప్పుడుకదా నాకు నీమీఁదఁ గోపము వచ్చును?

కృష్ణుడు- అవును.చదువుమనిన చదువకుండుట తప్పుగదా.

తండ్రి- చదువుకొనవలసిన సమయములో నాడుకొనుట తప్పని నీకే తెలిసినదికదా ? నీవు చేసిన తప్పు తప్పించుకొనుటకైకదా యబద్ధము చెప్పెద నంటివి? ఒకసారి వీవబద్ధమును జెప్పినావని నాకుఁ దెలిసిన రెండవసారి నిజముగా నీకుఁ దలనొప్పి వచ్చి నీవు పాఠము చదువక పోయినను నీమాట నేను నమ్ముదునా? పులి పులి బొంకిన పిల్లవానికథ నీవు చదువలేదా? నీవు కల్లలాడుటచేత నీవేకదా చెడిపోదువు? అట్లుచేయకనిజము చెప్పినయెడల నాకెంతో సంతోషము గలిగింతువు.చూచినవారందఱు "కృష్ణుఁడు మంచి పిల్లవాఁడు ఎన్నఁటికి నబద్ధము చెప్పఁడు" అని నిన్నుఁ గౌరవముతోఁ జూతురుకదా.నీ కీ లోకమందును బరలోకమందును సుఖము గలుగును.నీవు నిజమే చెప్పవలయునని నిశ్చయము చేసికొంటి వనుకొమ్ము.మొదటినాఁడు పాఠమేల చదువుకొన లేదనిన నాడుకొనుచుంటినని చెప్పుదువు.రెండవనాఁడు కూడ నాడుకొనుచుంటివని చెప్పుదువు.ఇట్లు ప్రతిదినము పాఠముచదువక"నేనాడుకొనుచుంటిని.నేనాడుకొనుచుంటి" నని చెప్పుటకు నీకే సిగ్గు తోఁచును.కాఁబట్టి సాకు చెప్పరాదని చదువుదువు ఆడుకొనవలసిననప్పుడే యాడుకొందువు.

రాముఁడు- అవు నవును.నాకొకపద్యము వచ్చును.

కం.చదువనివాఁ డజ్ఞుం డగుఁ
జదివిన సదసద్వివేక చతురత గలుగున్
జదువఁగ వలయును.జనులకుఁ ,
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ :

www.mohanpublications.com

తండ్రి- వింటివా! కాఁబట్టి చదువుకొనుటవలన బుద్ధిమంతుఁడవై ధనము సంపాదించి సుఖపడుదువు. ఇట్టులే సత్యమే చెప్పవలయునని నిశ్చయము చేసికొంటివేని దుర్గుణము లన్నియుఁ దొలఁగి పోవును. మంచిగుణములన్నియుఁ బట్టుపడును. మంచిగుణము లున్నయెడల దేవుఁడు సంతోషించును. నీకుఁ గావలసినవన్నియు నిచ్చును. అసత్యములాడ నేర్చుకొంటివా దుర్గుణములు పట్టుపడును. దేవుఁడు నిన్ను నరకమునకుఁబంపి శిక్షించును.

రాముఁడు- అవునురా కృష్ణా ! ముత్యమంత పుస్తకములో మనము చదువులేదా ధర్మరా జబద్ధ మొక్కటియాడినందునకే నరకము చూచినాఁడని?

అమ్మణ్ణి- నిజము చెప్పిననే మేలు సరేకాని ఒక యబద్ధము కూడఁ జెప్పనివాఁడు లోకములో నెవఁడైననున్నాఁడా ?

తండ్రి- లేక యేమి? ఒక రాజు చరిత్రము చెప్పెద విను. నేను జెప్పునవి యున్నియు వాస్తవముగ జరిగిన చరిత్రములే కాని పిట్టకథలు గావు.

------------------

www.mohanpublications.com

# హరిశ్చంద్ర చరిత్రము

శ్రీరాములని సీతా దేవియని మీరీ రాముఁడు చెప్పిన ముత్తైమంత పుస్తకములో జదివియున్నారుగదా! వారు పాలించిన దేశము కోసల.ఆ కో సలమున ముఖ్యపట్టనమయోధ్య.అది రాజులుండు స్థానము గనుక రాజధాని యందురు.శ్రీరాములకుఁ గొన్ని తరములకుముందు హరిశ్చంద్రుఁడను రాజుండెను.అతఁడు మొదటి జక్రవర్తి.భూలోకమంతయు నెవని స్వాధీనమందుండునో వానికిc జక్రవర్తియని పేరు.ఆయన భార్య చంద్రమతి.కొడుకు లోహితాస్యుఁడు.ఈ హరిశ్చంద్రుఁడు గురువులమాట వినక భ్రష్టుడైన త్రిశంకుని పుత్రుఁడు.ఆ కథ మీరు ముత్తైమంత పుస్తకములో చదివియున్నారుకదా.

ఈ హరిశ్చంద్రుఁడు మిక్కిలి ధర్మాత్ముఁడు.ప్రజలను దాను గన్న బిడ్డలవలె రక్షించువాఁడు.ఏ కార్యము లు చేసి తినేని వారికి సుఖము వృద్ధియగునా యని తలంచుచుండువాఁడు.పలికి బొంకనివాఁడు.అసత్యమా డనివాఁడు.కావున నతని రాజ్యమునఁ గఱవులు, వఱపులు, మిడుతలదండు, చిలుకలదండు, ఎలుకలదండు, పైరు చెఱువువానలు,లేక దేశము సుఖముగానుండెను.ఆ రాజ్యమున దొంగలు కుందేటికొమ్ములు.పాపాత్ము లాకాశపుష్పములు.మోసము బంగారుచిలుము. లోకు లందఱు దీర్ఘాయువు గలిగి రోగబాధ లేకుండిరి.

రుక్మిణి- అప్పుడు రోగములు నొప్పులు లేకపోనేల ? ఇప్పుడుండనేల?

తండ్రి- ఇప్పుడు జనులు పాపమెక్కువ చేయుచున్నారు.సారాయుము త్రాగుట, కల్లలాడుట,అప్ర మాణములఁజెప్పుట,మోసము చేయుట, ఒకరిసొమ్ము నాశించుట.పెద్దవారు చెప్పినట్టు వినక పోవుట, దేవునిమీఁదను,తల్లిదండ్రుల మీఁదను గురువులమీఁదను భక్తి లేకపోవుట మొదలైన పాపములను జనులు చేయుచున్నారు.దానివలన మన కిన్ని బాధలు.మునుపటి వారున్నట్టు మన ముంటిమేని,మనకేల రోగములు వచ్చును? మన మేల నూఱేండ్లయినను బ్రతుకకపోదుము ?

కం. రాజే సత్యము ధర్మము
రాజే సత్కులజులకును బ్రథితకులంబున్
రాజే తల్లి యుఁ దండ్రియు
రాజే హితపథ్యకరుఁడు ప్రజలకు నెల్లన్.

ఈ ప్రకార మా రాజు భూలోకమున సుఖముగ నుండఁగా స్వర్గలోకమున నొకవింత జరగెను. లోకమున సత్యము తప్పనివాఁ డెవఁడని యింద్రుఁడు మునులఁ బ్రశ్నించుట.

అమ్మణ్ణి- స్వర్గమనిన నేమి ?

తండ్రి- దేవతలుండు లోకమునకు స్వర్గమని పేరు.మన యీ భూలోకమునఁ బుణ్యము చేసినవారం దఱు స్త్రీలుగాని పురుషులుగాని అచ్చటికిఁ బోదురు.అచ్చటఁ గష్టము దుఃఖము అనుమాటే లేదు.ఆ లోకమునకు రాజు ఇంద్రుఁడు.మహేంద్రుఁడనినను దేవేంద్రుఁడనినను ఆయనకే పేరు.

ఒక్కనాఁడు దేవేంద్రుఁడు నిండుసభలోఁ గూర్చుండి వినోదముగా ముచ్చటలాడుచు మునీశ్వరులను జూచి యొక ప్రశ్నమడిగెను."మునీంద్రులారా ! ఈకాలమం దెవఁడైన కలఁడా ? తపస్సుచేత జరిగినది.జరుగు చున్నది,జరగఁబోవు నది మీరు తెలిసికొనఁగలరు. ఇట్లు మూఁడుకాలముల సమాచారము తెలిసిన మీరు కాక నా సందేహ మెవరు తీర్పఁగలరు?" ఈమాటలు విని సభయందున్న మునులు దిగ్భ్రమచెంది యేమి చెప్పలేకపోయిరి. అట్టివాఁ డెవ్వడు లేఁడనిన నవమానమే.మాకుఁ దెలియదనినను నవమానమే.చెప్పుట కాతెలియదు.ఏమి చేయవచ్చురా దైవమా యని యొక ఋషి యాకాశము చూచుచుండెను.ఒక ముని నేల కనుచుండెను.ఒకఁడు నేలమీఁద బొటనవ్రేలితోఁ వ్రాయుచుండెను.ఒకఁడు మఱి యొకని ముఖము చూచెను. ఒక యతీశ్వరుఁడు మఱియొకనికిఁ గనుగీఁటెను.ఒకఁడు నిట్టూర్పువిడిచెను.ఒకఁడు మఱియొకనిఁ జూచి పెదవి విఱిచెను.ఒకఁడు తల నడ్డముగ నాడించెను.ఒకఁడు స్మరణమునకుఁ దెచ్చుకొనువానివలె నటించెను. ఒకఁడు చూపుడు వ్రేలికొనపెదవిని జేర్చెను. పేరంటమువేళఁ గొందఱు ముత్తైదువలు "నీవు పాడు నీవుపాడు" మనునట్లుకొందఱు "నీవు చెప్పు నీవు చెప్పు" మని పంతులుపోక మిణకరించుచుండ వారి కలకలంబు వారించి వసిష్ఠుండు దేవేంద్రునితో నిట్లనియె.ఆయన మాటలు తరువాతఁ జెప్పెదను.మీలో నెవరైన వసిష్ఠుని జూచినవా రున్నారా ?

www.mohanpublications.com

రుక్మిణి- అమ్మణ్ణి నేను జూచితిని నేనుజూచితిని.

తండ్రి- ఎప్పుడు?

రుక్మిణి- నా పెండ్లప్పుడు మిద్దెమీఁదికిఁ బిలుచుయొనిపోయి యుత్తరముగాఁ దిరిగి యాకాశమును జూడుమంటివి. అక్కడ మంచపుఁ గోళ్ళవలె నాలుగు చుక్కలు వింటిదబ్బవలె మూఁడుచుక్కలుచూపి యా మూఁటిలో నడుమనుండు చుక్క వసిష్ఠుఁడని దానికి నానుకొని మినుకు మినుకుమను చిన్న చుక్క యరుంధతి యని మాకు నీవే చెప్పితివి.

తండ్రి- సరి. తరువాత వసిష్ఠుఁ డిట్లుచెప్పెను. ఓ వేల్పులతేఁడా! నీవడిగిన యట్టివాఁడు భూలోకమం దిప్పుడున్నాఁడు. వానిపేరు హరిశ్చంద్రుఁడు. అతఁడు సూర్యవంశపురాజు. అయోధ్యాపురమున కధిపతి. బొంకననెట్టిదో వా డెఱుఁగడు. అది విని విశ్వామిత్రుఁడను మఱియొక ఋషి "మేలు మేలు వసిష్ఠా! పిలువని పేరంటము చెప్పని యొక్క ప్రొ"ద్దన్నట్లు నీవేల యీ సభలో నోటికి వచ్చినట్లు మాటలాడెదవు? వసిష్ఠ మునీశ్వరా ! నీవు చెప్పవయ్యా! యని యెవరు నిన్ను బిండిబెల్లముపెట్టి పీఁకఁదీసిరి. ఎవరిచ్చిరి నీకీ పెత్తనమనిన ఆ మూలకుండ నెత్తిని వేసికొంటి నన్నట్లు తేరకు నీవేల యీపెత్తనము నెత్తిన వేసికొని పగ్గెలు కొట్టుచున్నావు. నీమాట లెంతనిజమో నీ శిష్యుని మాటలంత నిజము. రాజు లేయూరు? సత్యమేయూరు? ఆ రాజు పురోహితుఁడ వగుటచేత నాలుగు దక్షిణలెక్కువగ నీ కిచ్చినంతనే బట్టువలెఁ బొగడుచున్నావు ఆయన యుపూదినినంతనే యిటువంటి సభలో జంకక కొంకక వెఱవక మేఁకపిలను బులిపిలగాఁ జెపు



ఇంద్రసభయందు వసిష్ఠవిశ్వామిత్రులు కలహించుట.

ఉ. "ఒత్తుగ మాంసమున్ మడుఁటోగి రమున్ ఘృతశర్కరాదులున్।
కుత్తుకబంటిగా మెసఁగి క్రొవ్వి వధూరతి తంత్రలీలలన్ ।
మత్తిలి దేహముల్ మఱచి నూటికి బొంకు నృపాలకోటికిన్ ।
సత్యతలప నెక్కడిది ? సంయమి : నీకిటుపల్క c బాడియే ?"

అనెను.

అప్పుడు వసిష్ఠుఁడు నవ్వుచు "గాధిరాజనందనా! నేనసత్యమాడలేదు. హరిశ్చంద్రుఁడు నసత్యమాడఁడు. మా యింటనుండు బోనకత్తెయును గల్లలాడదు. తెలిసితివా ? ఆ చక్రవర్తినిగుఱించి నీ కేమియుఁ దెలియదు. మూఢులకు మౌనమే భూషణము. ఈ పల్లఱపు లేల ? నీవు రాచబిడ్డఁడవు గనుక నీవలెనే యందఱునని 'ఆత్మవత్సర్వభూతాని' యను నీతి గనుక నీవలెనే యందఱుందురని 'ఆత్మవత్సర్వభూతాని' యను నీతి ననుసరించి చెప్పుచున్నావు. దున్నపోతు తనకు సరిగానుండుదానిని జూచునే కాని యంతకంటె నెత్తున నున్నదానిని తలయెత్తి చూడఁజాలదు. అట్టులే జ్ఞానహీనులు తమకుఁ దెలియనివి లోకమున లేదనుచుందురు. దాని కహంకారము జ్ఞానములేమి కారణములు. చాలుఁ జాలుఁ గూర్చుండుము" అనెను.

ఈ మాటలు విశ్వామిత్రుఁడు విని మండెడు మంటలో నెయ్యిపోసినట్టులయి మండిపడి కన్ను లెఱ్ఱచేసి "ఓరీ రాజపురోహితుడా ! ఏమంటివీ. నాశక్తి మఱచితివా ? నే నెవ్వరో యెఱుంగవా ? హనుమంతుని ముందఱనా కుప్పిగంతులు ? తాతకుదగ్గ నేర్పినట్టు రాజులసత్యము నాయొద్దనా చెప్పెదవు ? నీ నడవడి

www.mohanpublications.com
తల్లిపుట్టినిల్లు మేనమామయొద్దఁ బొగడినట్లున్నది. ఈ ఋషీశ్వరులయందుఁ గాని బ్రాహ్మణులయందుఁ గాని యెవనినైనఁ జెప్పిన నమ్మవచ్చును గాని క్షత్రియమాత్రుని నాడితప్పనివాఁ డనిన నెవరు నమ్ముదురు? చెప్పెడివానికిఁ జెవుడైన వినెడివానికి వివేకములేదా యన్నట్లు నీ మాటలునమ్ముటకు నిచ్చట బుద్ధి లేనివారెవ్వరు లేరు. ఎద్దీనినదనిన గాఁటఁగట్టి వేయుమనుట రాజసభలయందుఁ గాని యిచ్చట కాదు. పొట్టపగుల మాంసము దిని, సారాయము ద్రావి, దున్నలవలె బలిసి, మత్తెకి, మిన్నుమన్ను గానక, పొగరుఁ బోతులై యాటపాటలయం దును జూదములందును స్త్రీల తోడను గాలము గడుపు రాజులఁట నిత్యసత్యవ్రతులఁట! నీ మాట లీ యింద్రుఁడు నమ్మిన నమ్మనీ. ఈ ఋషీశ్వరులు నమ్మిన నమ్మనీ. నేను నమ్మువాఁడఁ గాను. ఇంతటి లోకవిరుద్ధ పువార్త చెప్పుటకు నీకు సిగ్గేల లేదాయె" నని మేఘధ్వనితో ఘోషించెను.

ఆపల్కులు విని మేఘధ్వనికి సింహము మాఱుగర్జించినట్లు వసిష్ఠుఁడిట్లు చెప్పెను. గాధేయా! నీ కేల యీ మేఁకపోతు గాంభీర్యము. హరిశ్చంద్రుఁడు రాజగావున సత్యమాడఁడని నీ వాదము కదా? ఇందఱుదేవత లున్నారు. వీరిలో నొకఁడైన నేను సత్యము తప్పనివాఁడ నని ఱొమ్ముమీఁద జేయియుంచి చెప్పఁగల ధీరుఁడు కలిగెనా ? ఉండిన నేను జెప్పవలదంటివా? నీ వేలచెప్పుకోరాదు? ఏమీ హరిశ్చంద్రుఁడు రాజమాత్రుఁ డంటివా? గరుత్మంతుఁడు నూరఁబిచ్చుక సమానములని చెప్పుదువా? రెండును బక్షులేకదా? ఆదిశేషుఁ డు నులిపాము సమానుములా? రెండును సరీసృపములే కదా. నీకును కౌశికనామము కలదు గదా? నీవు గుడ్లుగూబ యొకటిఁగాఁ జెప్పవచ్చునా ? ఏల వివేకములేక వాఁగెదవు? గుణము ప్రధానమా? కులము ప్రధానమా ?

ద్వి. "కులము ప్రధానమే గుణములేకున్నఁ
గలశాబ్ధిఁ బుట్టదే కాలకూటంబు."

ఆత్రగానికి బుద్ధిమట్టన్న సామెత నీయందు సత్యమగుచున్నది. ఇఁకనైన వదరకుము. నీకాఱులు మాని శాంతింపుము" అనెను. ఆ మాటలు విని కోపమున దేహము వణఁక, కన్నుబొమలు నటింప, పెదవి చలింపఁ గటము లదరలేచిచేయి యాడించుచు వసిష్ఠా ! మేఁకపోతు కూఁతకు సింహము బెదరునా? తగరుకొండను దాఁకినట్టు నన్ను నీవు డీకొంటివి. నేను బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి చేసినా ననుట మఱచితివి హరిశ్చంద్రు నే నెఱుఁగనంటివి. హరిశ్చంద్రు సబ్బునుగూడ నే నెఱుఁగుదును. అది నీ నూర్గురు కొడుకు లెఱుఁగుదురు. నీ వెఱుంగదువు. నీకు గ్రహచారము చాలక మతిమఱపు కలిగెను. తెలివి తెప్పించెద మగతనము కలదేని నీమాటపై నిలుము. ఎట్టులైన నేను హరిశ్చంద్రుని బొంకించిన నీ వేమయ్యెదవు ? పందెము కట్టుము" అనెను.

వసిష్ఠుఁడు నవ్వుచుఁ దన్నుఁదాను బొగడుకొనుట యితరుల దూషించుట మరణ సమానములు. ని న్ను నీవు పొగడుకొనుటవలననే నీ గొప్పతన మెట్టిదో తెలిసెను. హరిశ్చందు నబ్బను దెలియునంటివి. వినాయ కుని జేసెదవా కుమ్మరీ యనిన ఆయన యబ్బను జేసెదనని లింగముచేసి యిచ్చినట్లు నీ మాట లున్నవి. త్రిశం కుని భూమికిఁ గాక స్వర్గానికిఁ గాక నీవు చేసిన దెవరెఱుఁగరు ? ఆమాట లేల? నీవు హరిశ్చంద్రునిచే నెట్లైన నసత్య మాడించెద నంటివి. అట్లు నీవసత్య మాడించితివా నేను జందెములు త్రెంపి పాఱవైచి బ్రాహ్మ ణత్వము మానుకొని, జపము, తపము చాలించి తల గొఱిగించుకొని మైలబూడిద దేహమునకుఁ బూసికొని దిసమొలతో గాడిదనెక్కి మనుష్యుని పుఱ్ఱెలో సారాయము పోసికొని త్రావుచు దక్షిణదిక్కుగాఁ బోవువాఁడను. "కౌశికా ! సూర్యుఁడు పడమటఁ బుట్టినను, అగ్నిహోత్రుఁడు చల్లనైనను, సముద్రము లెండినను, ఆకాశము నేలఁ గూలినను హరిశ్చంద్రుఁ డసత్యమాడఁడు. కస్తూరికి సువాసన స్వభావము. నీవు వలదనినఁ బోవురా? నీరుపోసి కడిగినఁ బోవునా? ఆ రాజేంద్రుని మనసెఱుగక చెప్పుటకు నాకేమి వెఱ్ఱియా?" యనెను.

విశ్వామిత్రుఁడు పటపట పండ్లుగొఱికి కాలితో నేలఁ దన్ని చేయి చాఁచి "ఓయింద్రా! ఓ ఋషీశ్వ రులారా! ఓ దేవతలారా ! నా ప్రతిజ్ఞ వినుఁడు. ఎన్ని మాయలైనఁజేసి యెన్ని కష్టములైనఁ బెట్టి హరిశ్చంద్రుఁ డు బొంకునట్లు చేసెదను. అట్లునేను జేయఁజాలనైతినేని నే నిదివఱకుఁ జేసిన తపస్సులో సగము హరిశ్చంద్రు నికిచ్చి పదునాలుగు మహాయుగములు భూమిఁ బాలింపఁ జేసి కడపటఁ బదునాల్గవ మన్వంత మున నింద్రుని యర్ధసింహాసనమునఁ గూర్చుండఁ జేసెదను" అనెను అప్పుడు వసిష్ఠుఁడు "నీవేగాక నీవంటి ఋషీశ్వరులు పదివేవురు చేరి యాయనను బాధించినను బొంకఁడు పో పొ" మ్మనెను.

ఆ ఋషీశ్వరు లిరువురు తపోబలముచేతఁ బ్రపంచము పుట్టింపను గిట్టింపను జాలినవారు అట్టి

www.mohanpublications.com

వీరి రోషభాషలకు లోకమును వీ రప్పుడే నాశముచేయుదు రేమోయని యందఱు భయపడిరి. భూమి పదఁ

కెను. చుక్కలు రాలెను. ఈ యుత్పాతములు చూచి యింద్రుఁడు సభ చాలించి లేచి పోయెను. మునులకింత కోపమాయను వారును. వీరి నడవడి కోడెలు కోడెలు గ్రుమ్ములాడి లేఁగలకాళ్ళు విఱిచినట్లున్న దనువారును, వసిష్ఠున కేల యధికప్రసంగితన మనువారును,ఆయనకుఁ దోఁచిన దాయన చెప్పెను దప్పేమి? యను వారును, గిచ్చి కలహమునకుఁ బిలిచినవాఁడు విశ్వామిత్రుఁడే యనువారును నై దేవతలు వారివారి యిండ్లకుఁ బోయిరి. అక్కడ నిల్చినఁ దమకేమి కీడు మూఁడునోయని ఋషీశ్వరులు దిగాలున లేచి కళాసములు జాడించి చుట్టి చంకకుఁ దగిలించుకొని జడలు వీడుచుండ నారచీర లూడుచుండఁ జత్రాతిమీఁ ద వ్రక్కలైన కుండలోని గ్రచ్చకాయలవలె నొకఁడు పోయినత్రోవ నింకొకఁడు పోక యొకరితో నొకరు మాటలాడక యెవరి త్రోవ వారు పోయిరి.

## విశ్వామిత్రుఁడు మాయలు పన్నుట.

విశ్వామిత్రుఁడు తన యాశ్రమము చేరియెట్లు హరిశ్చంద్రుని బొంకింప వచ్చునా యని యాలోచించు చుండెను. ఆ సమయమున జైత్రమాసము వచ్చెను. చైత్రమాసమేదో మీకుఁ దెలియునా? ఏదినము మనము సంవత్సరాది పండుగని ఉగాదియని పండుగులు చేసికొని వేఁపపూవు మామిడి బద్దలు క్రొత్తచింతపండు గుజ్జులోఁ గలిపితిందుమో, ఏనాఁడు సాయంకాలము క్రొత్తపంచాంగము చదివించి విందుమో ఆ దినమే చైత్రమాసమున మొదటిదినము. దీనికి సాధారణముగాఁదొమ్మిదవనాఁడే శ్రీరామజయంతి యని శ్రీరాములు పుట్టిన దినమని సంతోషముతో నందఱకు వడపప్పు-పానకము-నీరు-మజ్జిగ-విసనకఱ్ఱలు మొదలయినవి యిచ్చి రామరామ యని భజనలు చేయుదుము.

రంగన్న- ఆ నెలకుఁ జైత్రమని యేల పేరు?

తండ్రి- ఈ నెలలో చిత్రానక్షత్రమునాఁడు పున్నమ వచ్చును. అట్లే యే నెలలోనే నక్షత్రమునాఁడు పున్నమవచ్చునో యానెల కానక్షత్రము పేరువచ్చును. విశాఖతోఁ గూడిన పున్నమగలది వైశాఖము. జ్యేష్ఠతోఁ గూడిన పున్నమ గలది జ్యేష్ఠము. ఇట్లే తక్కినవి. తరువాత కథ వినుండు.

చైత్రమాసమునందు హరిశ్చంద్రుఁడొక యాగముచేయ నారంభించి యెవ్వరేది యడిగినను లేదనక యిచ్చుచుండెను. ఈ వార్త విని సందు దొరకెనని సంతోషించి విశ్వామిత్రుఁడు హరిశ్చంద్ర నొద్దకుఁబోయి యాశీర్వదించి యతివినయంబున త్రిశంకునందనా ! నీవు నిత్యసత్యవ్రతుఁడవు. ఉత్తమకులజుఁడవు మహా దాతవు ప్రథమ చక్రవర్తివి నీయట్టి వాఁడు లోకమున లేఁడు. నీకీర్తి లోకములయం దన్నిట నిండి యున్నది. నీవు యాచకులకు కల్పవృక్షమవు. అర్థుల పాలిమేరుపర్వతమవు దీనులపాలి పెన్నిధివని యనేకవిధముల ముగా స్తోత్రము చేయుచున్నాఁడు. అతి వినయము ధూర్తలక్షణ మందురు. 'ఈయన మనస్సులో నేదియో యుంచుకొని వచ్చినట్లున్న' దని రా జెంచి మునీంద్రా ! మీ దయ చక్కఁగ నాపై నుండునేని నేను ధన్యుఁడను తమ రాకకుఁ గారణము తెలిపినఁ గృతకృత్యుఁడ నయ్యెద ననెను. రాజేంద్రా మఱేమి విశేషము లేదు. కల్ప వృక్షమును గసుగాయ నాశించినట్లు నీవలన నొక యల్పకార్యము కావలసి వచ్చితిని. ఇచ్చెద ననినఁ నొక యల్పకార్యము కావలసి వచ్చితిని. ఇచ్చెద ననినఁ జెప్పెద ననెను. అది విని హరిశ్చంద్రుఁడు మునీంద్రా ! మాఱట బ్రహ్మవు. మీ రడిగిన నేను లేదనుదునా? దాతకుఁ బాత్రము పూర్వ పుణ్యముననఁగాని లభింపదు. యాదృచ్ఛికముగ వచ్చిన పాత్రమును బోఁగొట్టు దాతయుండునా? మీ కోరిక నవశ్యము దీర్చెద. ఆనతిం దనివేఁడుకొనెను. నేను యజ్ఞముచేయ సంకల్పించియున్నాను. దానికి మనుష్యుఁడేనుఁగునెక్కి చేయెత్తి రత్నము మీటిన నెంతయెత్తు పోవునో యంత యెత్తుధనరాశి కావలయునని విశ్వామిత్రుఁడనెను. అవశ్యమిచ్చెదను తీసికొనుఁడని హరిశ్చంద్రు డీయఁబోఁగా"రాజా! ఇప్పుడు వలదు ఇంతధనము నే నెచ్చట దాఁతును. దొంగల వలన భయము కలుగును. నీయొద్ద నుండనిమ్ము. పనిపడినపుడు తీసికొనిపోయెదను" అని విశ్వామిత్రుఁ డచట నిలువక గిఱ్ఱునఁ దిరిగిపోయెను.

యజ్ఞమఁట? ఏనుఁగుమీఁద మనుష్యుఁడు నిలఁబడి రత్న మెగురవేసినంత యెత్తువిత్తమఁట ! ఇప్పుడు వలదఁట ! విశ్వామిత్రునకు దొంగలభయమఁట ! ఔరా వింత!! ఈయన నడవడి వక్రముగా నున్నది. ఏమి కారణమో? ధనము తీసికిమ్మని బలవంత పెట్టితినా శపించును. ఏమి చేయవచ్చును. కానిమ్ము భగవంతుఁడే కలఁడని ధైర్యము వహించి యథాప్రకారము హరిశ్చంద్రుఁడు రాజ్యము పాలించుచుండెను.

www.mohanpublications.com

## విశ్వామిత్రుఁడు మాయమృగముల సృజించుట.

విశ్వామిత్రుఁడు మఱియు నాలోచించి వేలకొలఁది మాయామృగముల సృజించి హరిశ్చంద్రునిరాజ్య మల్లకల్లోలపఱుపఁబంచెను.వాని రాయిడికిఁ దాళలేక కాఁపులు హరిశ్చంద్రునొద్దకు వచ్చి మహారాజా! నీ చల్లనిరాజ్యంబున నిన్నిదినములు సుఖముగఁ గడుపులోని చల్ల కదలక యుంటిమి.ఇప్పుడేమి విపరీతమో తెలియదు.నేల యీనిన ట్లడవిమృగంబులు కోటానఁ గోటులు వచ్చి చెట్టు చేమ గొడ్డుగోడ పైరుపచ్చతోఁట దొడ్డి యనక యన్నియు నాశనము చేసినవి.మేము బ్రతకు వెరవే కనఁబడలేదు.అని విన్నవింప రా జిట్లనియె. రైతులారా ! మీరు భయపడవలదు.మావిచారణ లోపమున మీకుఁ గలిగిన నష్టిని మేము భరించెదము.మేము ఱేపు వేఁటకు వచ్చి యా మృగముల నెల్ల వధించి మీబాధమాన్పెదము.యథాసుఖముగా నిండ్లకు నిర్భయంబు గఁ బొండని సెలవిచ్చిపంపెను.ఆ మఱునాఁడు వేఁటరు లెల్ల సిద్ధముగ నుండవలయునని వెంటనే యుత్తర్వు చేసెను.బలబల తెల్లవాఱినతోడనే రాజు భార్యతోడను గుమారునితోడను రథమునఁ గూర్చుండి తగిన పరివారముతోడను సత్యకీర్తియను ప్రధానితోడను వేఁటకై పోయి పులులు, చిఱుతలు, సివంగులు,సింగములు ఏనుఁగులు,పందులు, దుప్పులు,తోడేళ్లు లోనగు దుష్టమృగములను జంపియును సాళువము గిడ్డు,లగుడు, వేసడము,కురుజు,బాజు, సెలకట్టె,జాలియ,వైల,యఱజు,ఓరణము అను డేగల విడిచియు గ్రద్ధ,కొంఁజు,గక్కెర గూబ,పారువము,బెగ్గురు,కొక్కెర,కొండలావుక,ఆడేలు,గువ్వ,వెలిచ,పొట్టిపిట్టలోనగు పక్షులఁ జంపియు వాదముత్రవ్వి యురులొడ్డి వలపన్ని జంతువుల హింసించియు నీవిధముగ ఏదువేఁట,గంటవేఁట,తెరవేఁట పక్షివేఁట,పాఱువేఁట,విడి వేఁట లోనగు వేఁటలాడి యచటికి సమీపమందున్న వసిష్ఠమహాముని యాశ్రమంబునకుఁబోయెను.

వసిష్ఠుఁ డతనిని జూచి హరిశ్చంద్రా ! వేఁట సప్తవ్యసనముల లోనిదని నీ వెఱుఁగవా ?నీకిది తగునా? ఈ కార్యమొనర్చుటకు వేఁటరులు లేరా ? అయినదానికి వగచుట నీరు పోయినపిమ్మట అనకట్టినట్లు కావున నిఁకనైన నిందు నిలువక చక్కఁగఁ బురంబునకుఁ బొమ్ము.ఏమఱియైన మఱచియైన భ్రమనైన నీవు విశ్వామిత్రుని యాశ్రమంబునకుఁ బోకుము.ఆయన యుండువైపు తలయుంచియైన నిద్దురింపకుము. హెచ్చరికసుమా యని బోధించి పంపెను.

================

## హరిశ్చంద్రుఁడు జింకనుదఱుముకొనిపోయి విశ్వామిత్రవనంబుఁ జొచ్చుట.

తన గురువు నాజ్ఞప్రకారము హరిశ్చంద్రుఁ డయోధ్యకుఁ బోవుచుండెను.ఈ సమాచారము విశ్వామిత్రుఁడెఱిఁగి యాయన నెట్టులైనఁ దన యాశ్రమమునకుఁ రప్పింపనాలోచించి బంగారుమయమై చిత్రమైన వన్నెలుగల జింకను సృష్టించి మార్గమున కడ్డముగఁ బంపెను.దాని నలువును జెలువును తళుకును బెళుకును జూచి లోభబుద్ధిచే రాజు దానిని వెంబడించెను.తాను జేసిన జీవహింస యొక రూపమునుదాల్చి యా పాపఫలము ననుభవింపఁ జేయుటకై లాగుకొని పోవుచున్నదో యన్నట్టు లా జింక నక్కుచు నిక్కుచుడాఁగుచు లోఁగుచు జిగులు నగలు మెఱయ రాజును విశ్వామిత్రు నాశ్రమమునొద్దకుఁ దీసికొనిపోయెను.అది తప్పించుకొనిపోవునని త్వరపడి బాణముచే రాజు దానిని గొట్టెను.అది యేటుపడియుఁ జిక్కక చక్కఁగా విశ్వామిత్రునొద్దకుఁ బోయి యదృశ్యమయ్యెను.

================

## హరిశ్చంద్రుని కల

హరిశ్చంద్రుఁడు మిక్కిలి డస్సి రథముడిగ్గి పచ్చికపై భార్యతొడమీఁద శిరస్సుంచి పండుకొనెను.నిద్రించియించు కంతసేపులో నులికిపడిలేచి దిగ్భ్రమచెంది ముఖము వెలవెలఁబాఱఁజూచుచుండెను.చంద్రమతియుఁ దనమృదువైన కరముల నాతని మేను నిమురుచుఁ బ్రాణేశ్వరా ! ఇది యే మిట్టు లైతిరని యడిగెను.హరిశ్చంద్రు డిట్లు చెప్పెను."ఓ ప్రియురాలా ! నేను నిద్రించుచుండనొక బ్రాహ్మణుఁడు నా కిరీటము నేలఁబడఁదన్ని నా తలవెండ్రుకలు పట్టి లాగి యూరు వెడలఁ గొట్టి కన్నత్రిప్పులు పెట్టెను.తుదకు భగవంతుని కురుణచే మరల మన రాజ్యము నొందితిని.అది తలఁచిన దేహము వణఁకుచున్నది చూడుము" అనగాఁ జంద్రమతి దేవి యిట్లనియె."వల్లభా ! మీవంటి ధీరులు కలలకే యులికెదరా ? కలలోన నడచినది కలకాలమున నడవదను సామెత వినరా ? దేహము గాసిచెందిన మనస్సు వ్యాకులత చెందును.మనస్సుకళవళించినఁ

www.mohanpublications.com
గల లెన్ని యోవచ్చును. అందును బగటికలలు పాటింతురా ? అంతియ కాక మనసెఱుఁగనికల ఒడలెఱుఁగని సివము లేదుకదా ? విశ్వామిత్రుని చర్యయును వసిష్ఠుని వాక్యములు మీ మనస్సున వర్తించుచుండుటచే నిట్టికలవచ్చెను అని పతి నూరార్చెను గాని మనస్సు నిలుకడగల సాధువుల కలలు సరిదాఁకు ననియు విశ్వామిత్రుని వలన నేదియో కీడు రానున్నదనియు నూహించి యాబుద్ధిమతి దృఢచిత్తయై దైవము స్మరించుచు ండెను.

కం. మతిరీతి నెఱిఁగి సముచిత
గతి నాయా సమయములను గర్తవ్యంబుల్
హితయతి బోధించుచు నిజ
పతికిం దోడ్పడెడుసతియె భార్యయనంగన్.

==============

**విశ్వామిత్రుఁడు మాతంగకన్యకల హరిశ్చంద్రు నొద్దకుఁ బంపుట.**

ఇట్టులు హరిశ్చంద్రుఁడును జంద్రమతియును సత్యకీర్తియును నాలోచించుచుండు సమయంబున విశ్వామిత్రుఁ డిరువుర మాలకన్యకల సృష్టించి వారి కేమో బోధించి హరిశ్చంద్రుని యొద్దకుఁ బంపెను. వారి మేనులు నల్లనివేగాని యింద్రనీలముల కాంతిగలవి. ముఖములా చంద్రబింబము వంటివి. వారి చక్కఁదనము చూడఁ జూడ నింకను జూడవలయునని యాశ గొలుపుచుండును. అట్టి యీ మాలమాయలాఁడులు హరిశ్చంద్రునిఁజేరి నమస్కరించి చేతుల వీణెలూని మనోహరముగఁ బాడిరి. వారి పాట కానందించి రాజు వారికి నాభరణములు కానుక లిచ్చెను. వారు వానిని గైకొనక యాఁకలిగొనినవారి కాభరణములేల? యనిరి. 'మాయొద్ద నన్నము లేదు. వీని నెవరికైన నిచ్చి చుట్టుప్రక్క గ్రామములందన్నము భుజింపుఁ' డని రాజు చెప్పెను. 'మా క్షుత్తుకడుపులోనిది గాదు మనస్సులోనిది. అన్నములేక కాదు తగిన భర్తలేక' యనిరి. అనినరాజు కోపించి 'జాతికొలఁది బుద్ధియనుట మీయందు నిక్కమయ్యె. ఇటువంటి నీచవాక్కు లాడినఁ గోపింతును. తారతమ్య జ్ఞానములేక మాటలాడవలదు' అని కసరి పలికెను. వారును వినయము నటించుచు రాజేంద్రా 'మేము విద్యావతులము కావున నాగరికత గలవారము. వయస్సు వృథాపోవుచున్నది. మా జాతియందు మాకుఁ దగిన వరుఁడు లేఁడు. మన్మథుఁడా దుర్ని వారుఁడు. కులభేదములు వావివరుస లెఱుఁగఁడు. తారతమ్యములు కానఁడు. వాని పట్టు వదలఁడు. కావున మమ్మేమి చేయుమనెదవు? మీ యాటలు పాటలు నీటులు తేటలు వ్యర్థము చేసికొనుఁడనెదవా? మా వయస్సడవినికాచిన వెన్నెలా? మాచాతుర్యములు స్మశానపుష్పములా? మా సొగసులుబచ్చెన పూఁతలా? మా లావణ్యము సముద్రనీరమా? మేము మనోవేదనచే దగ్ధలమై పోవలయునా? మాకంటికింపైన వానిని గోరరాదా? నీ శరణు చొచ్చితిమి. మమ్ము వివాహమాడు మంటిమి. మా ప్రాణములు కాపాడుమంటిమి. నీవు పురుషుఁడవు కావా? శరణాగతుల రక్షించు బిరుదు లేదా? యనిరి.

వారి మాటలు రాజు విని " నే నేకపత్నీవ్రతుఁడను పరస్త్రీలందఱు నాకుఁ దల్లులు తోడులు. కావున మీరు మీకుఁ దగిన వానిని గోరుకొనుఁడు. మీరు విద్యలు నేర్చుట దుశ్చేష్టలు చేయుటకా? నీతిశీల మతాచారములు పాడుచేయుటకా ? మీ సౌందర్యము పరుల లాలించి బేలించి చెఱుముగ నవ్వుచు నీవే మాకుఁ దగినపతివని సమీపంబునకు రాఁగా దూరము పొందని చేతి బెత్తముతోఁ ద్రోసెను. ఆ గయ్యాళు లది నెపముగఁగొని అయ్యో మమ్ముఁ గొట్టెనే కొట్టెనే చంపెనే అయ్యో పాపాత్ముఁడా ! ఆఁడుపిల్లలను గొట్టెదవా యని బిగ్గ యేడ్చుచుఁ దలలు విరియంబోసికొని హారములు త్రెంచుకొని చీరలు చించుకొని కన్నుల నీరు నించుకొని పగులఁగొట్టుకొనిన గాజుతునుకలచే దేహము మీఁద గాయము లేర్పఱుచుకొని విశ్వామిత్రుని యొద్దకుఁబాఱిపోయి జరిగిన వృత్తాంత మతనితోఁ జెప్పిరి.

రూపము మాటలు మనోహరముగనున్న గుణము నట్లే యుండునని నమ్మి హీనులను జేరఁదీయరాదు. నాగుఁబాము విషము వజ్రముకన్న మిన్నగ మెఱయుచుండును. వేఁటగాని గానమునకు మోసపోయికదా జింకలు వలలోఁ దగులు కొనును.

===============

www.mohanpublications.com

## విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిఁ బరిభవించుట.

చంద్రమతి హరిశ్చంద్రులు సత్యకీర్తియు నివన్నియుఁ జూచి యేదో విపత్తు రానున్నదని భయపడుచుండిరి. ఇంతలో విశ్వామిత్రుఁడు సహింపరాని కోపమున భూమి యదురునట్లు నడచుచుఁ బ్రళయకాలాగ్నివలె మండుచు వడిసెల రాయివలె విసవిసవచ్చి హరిశ్చంద్రుని కిరీటము నేలఁబడునట్లు కాలితో నెగసి తన్నెను. రాజును శాంతిని తెచ్చుకొని మునీంద్రా నే నేదో తప్పు చేయక మీకుఁ గోపమురాదు. నేరమునకుఁ దగిన శిక్షచేసితిరి. మీకది శిక్షగఁదోంచెనేమో గాని నాకది యనుగ్రహమే. మీ పాదధూళి నా శిరమునఁ బడుట నేను బావనుఁడ నైతిఁ గాని ఱాలతో నిండిన యీ కిరీటము మి మృదుపాదముల నొప్పి ంచెనో యని దుఃఖపడుచున్నాను. బాలుఁడు దోషము చేసినఁ బెద్దలు దండింపవలసినదే, అది బిడ్డలకే శ్రేయస్కరము. అని హరిశ్చంద్రుఁడు పలుక విశ్వామిత్రుఁడు చూపులచేతనే యతని దహించువానివలెఁ జూచుచు "నొచ్చినవి నా పాదములేగావు. నీ నడవడికి నా కాపాద మస్తకము మండుచున్నది. ఓరీ నృపకులా ధమా లోకమున రాజులు లేరా ? వేఁటకు రారా ? మృగములఁజంపరా? నీవలె నాశ్రమమృగముల హింసించు క్షత్రియపాంసనుఁడు కలఁడా? నా పెంపుడు జింక నీ కేవిషముపోసెను? కఱచెనా? పొడిచెనా? అదియునుగాక నాయాశ్రమమునంతయు నీసేన విడియించి పాడుచేసితివి. నీ వేమో దొడ్డచక్రవర్తిని కదాయని యెంచి తమ పాండిత్యము నీకుఁ జూపఁదలంచి ప్రఖ్యాతి యాశించి వచ్చిన నాముద్దుకూనలఁ జిన్నారిపాపల గారాబు బిడ్డలను బశువులను బాదినట్లు బాదితివి. నిన్నొక కాసైన నిమ్మని వారడగలేదుగదా. కఠినాత్ముఁడా? ఆఁడుపిల్లలఁగొట్ట నీ చేతు లెట్లాడెరా? నీ శిరము ఖండించినను నీ చేతులు తుండించినను నా కసీతీఱదు. నీకింతపొగరా? పోతరమా? కన్నులుగానవా? చూడు నిన్నిప్డు దగ్ధము చేసెదను" అని గద్దించి పల్కెను.

కోపించువానిపై మనము కోపింపరాదు. కోపమనెడు రోగమునకు శాంతమనునది మందు. కోపమునది నిప్పు. శాంతచిత్తము పచ్చిగడ్డి. అని హరిశ్చంద్రుఁ డాలోచించి "అపరపరమేష్ఠీ ! మీరు సంకల్పమాత్ర మున మూఁడులోకములఁ బుట్టింపను గిట్టింపను సమర్థులు. అట్టి మీకు నే ననెంత. పిచ్చుకపై బ్రహ్మాస్త్ర మన్నట్టు నాయట్టి యల్పుని మీఁదనా మీ కోపము. నేను మీ బిడ్డఁడను పాలలోముంచినను నీళ్ళలోముంచి నను ఆ కీర్త్యపకీర్తులు మీవే" అని యతని పాదములపైఁ బడెను. సజ్జనుల కెవ రెంత యపకారము చేసినను శాంతిగుణము మానరు. అప్పుడు విశ్వామిత్రుఁడు కోపము చాలించి "త్రిశంకునందనా ! లేలెమ్ము దాసరి తప్పులుదండముతో సరి. నీ తప్పులను మన్నించితిని. నాకు నీవు సంతోషము గలిగింపఁ గోరుదువేని నాకూఁ తులను వివాహమాడు" మనెను.

హరి- మహాత్మా ! నీ నేకపత్నీవ్రతుఁడను. మీ రెఱుంగరా?

విశ్వా- నిన్నుఁ బరస్త్రీతో సంగమము చేయుమని నేను జెప్పలేదుకదా. వీరు కన్యకలు. వీరిని వివాహ మాడుము. వారు నీ పత్ను లగుదురు. అప్పు డేకపత్నీవ్రతమునకు హాని కలుగునా?

హరి- మునీంద్రా పొట్టకూటికై గ్రామ్యమగ్రామ్యమని వాదించు కక్కుర్తిపండితులవలె శబ్దార్థము చెప్పెదరేల? నే నీ జన్మమందు రమించునది యొక్క స్త్రీతోడనే. అదియు నాభార్యతోడనే. పెక్కురు భార్యలతో రమించువాఁ డేకపత్నీవ్రతుఁడు కానేరఁడు.

విశ్వా- బహుపత్నీకుఁ డగుటవలన దోషములేదు. నా పుత్రికలఁ గైకొనుము.

హరి- బహుపత్నీకుఁ డగుటవలన దోషము లేదనియే యెంతముగాక, కులహీన స్త్రీలఁ బెండ్లాడు టవలనఁ బాతకము లేదా? మాలస్త్రీలు మి కెట్లు పుత్రికలైరి? మాలెత పొత్తు మీకుఁ గలదా?

విశ్వా- మేము జితేంద్రియులము మాకు లోకమంతయు భగవత్స్వరూపముగాఁ దోఁచును. కావున జాతిభేదము మేము పాటింపము. లోకమున నందఱు ధర్మరీతిని మా బిడ్డలే.

హరి- మేము మీయట్టి బ్రహ్మజ్ఞులము కాము గనుక జాతి భేదము పాటింతుము. కూటికిఁ దక్కువైనఁ గులమునకుఁ దక్కువా యన్నట్లు కూటికి బీదయయినను బూర్వజన్మమునఁ జేసిన పుణ్యముల వలన లభించిన యుత్తమ కులమును బోఁగొట్టుకొను వెఱ్ఱి యెవఁడైన నుండునా?

విశ్వా- నిన్నుఁ బెండ్లిచేసికొనిరేని వారు సర్వరాజ్య సుఖముల ననుభవింతురనికదా నే నాసపడుచు న్నాను. అట్లు కాదేని వారి తళుకుబెళుకులకే మోహించి వివాహముచేసికొన నువ్విళ్లురు విద్యార్థు లెందఱు లేరు? నేను బాఠములు చెప్పునపుడు విద్యార్థులలోఁ గొందఱు కీ మాలెతనలమీఁదనే కన్ను. నీవు వలదనిన

www.mohanpublications.com
క్షత్రియుండే వలదనియెనే బ్రాహ్మణులము మేము చేసికొందుమా యని యింక వలదందు రేమో. కావున నీవు వారిని వివాహమాడి రాజ్యసుఖముల సంతుష్టులఁజేయవలయును. వారికి సుఖము గలిగించుటే నాపర మోద్దేశము.

హరి– వారికి రాజ్యసుఖములు కలిగించుట మీకు ముఖ్యోద్దేశమైనయెడల నా రాజ్యమైన మీరు గైకొని వారి కిందుగాని నన్ను మాలమాదిగల పాలుచేయ నెంచకుఁడు.

విశ్వా– ఏమి రాజా ! రాజ్యమునైన వదలి పెట్టెదవు గాని హీనజాతిస్త్రీలఁ బెండ్లాడవా?

హరి– ఆడను.

విశ్వా– అటైన రాజ్యమును వదలిపెట్టుము.

హరి– రాజ్యమును వదలి బ్రహ్మర్షులైతిరే క్రక్కినకూడు మరల నాశింతురా ? నామనస్సు పరిశీలించు టకు నడుగుచున్నారు కాఁబోలు.

విశ్వా– నావిచారము నీ కేల? రాజ్యమైన నిమ్ము. అసత్యమాడితి నై నఁ జెప్పుము. ఇచ్చకములు వగలమాటలు చాలింపుము.

హరి– హరిశ్చంద్రుఁ డసత్య మాడఁడు. దేవాదాయములు బ్రహ్మాదాయములు తప్పఁ దక్కినవన్నియు మీకు దానము చేసితిని. ఇదిగో నా కిరీటము. ఇదిగో నా ముద్రిక. తీసికొనుఁడు. సత్యకీర్తీ! ఇఁక మీకు విశ్వామి త్రుఁడే రాజు. ఋషీశ్వరా ! ఇఁక మీరు రాజ్యమేల పోవచ్చును.

విశ్వా– రాజేంద్రా నీవు మిక్కిలి గొప్ప దాతవు. నీ సమానులు లేరు. పలికి బొంకనివాఁడ వనిన నీవే సరి.

అప్పుడు లోహితాస్యుఁడు తథాస్తుఅనెను. చంద్రమతి పుత్రుని జూచి నాయనా యేల తథాస్తంటి వని యడిగెను. 'అమ్మా యీ ఋషి యెవరో గొప్పవాఁడే కాని మోసగాఁడుగా నున్నాడు. అప్పను అసత్యమాడిం పవలయునని చూచుచున్నాఁడు. ఆయన నోటనే నీవు పలికి బొంకనివాఁడ' వని వచ్చెను. దానికిఁగాఁ దథాస్తం టిని. " బాలవాక్యము బ్రహ్మవాక్యము. నాయనా ! నీ మాట తప్పదు" అని చంద్రమతి యనెను.

అప్పుడు విశ్వామిత్రుఁ డౌరా యీ బాలుఁడు నా యాట నా మెడకే యురివేయుచున్నాఁడు. ఆ మాట నే నేల చెప్పితినని మనస్సులో ననుకొనుచుఁ జక్రవర్తీ ! నిన్నొకటి యాచించెద నిచ్చెదవా? బ్రాహ్మణుఁ డను. మీ తండ్రికి నూర్ధ్వలోక మిప్పించినవాఁడను అని యడుగ హరిశ్చంద్రుఁడు 'మునీంద్రా యాచకుల యాశ నిదివఱకు వ్యర్థపఱుపలేదు. ఇప్పుడు చక్రవర్తి మీరుగాని నేనుగాను. నేను మీ కేమి యీయఁగల? నా సోమ్మేదైన నడిగిన నిచ్చెదను.' అని చెప్పఁగా 'నా రాజ్యమువలన నాబిడ్డలకు వెంటనే రాఁగల లాభమేమి! నా గారాబు బిడ్డలకు నీ సొమ్ములు నీ భార్య సొమ్ములు నీ కుమారునిసొమ్ములన్ని యిమ్ము, వారు పెట్టుకొనఁ గాఁ జూచి సంతోషపడ వలయునని కోరికగలదు.' అని విశ్వామిత్రుఁ డనగ 'దేహి యన నా స్థితియందునా? ఇవె నా సొమ్ములు ఇవి నా భార్య యాభరణములు తీసికొనుఁడని యిచ్చెను. 'నీ పుత్రుని భూషణము లీయవా' యని విశ్వామిత్రుఁడడుగ లోహితాస్యుఁడు 'అమ్మా ! ఈబ్రాహ్మణునికి సంతుష్టి లేదు. కనుకఁ జెడి పోవును. ఆ మాట మనకేల గాని బ్రాహ్మణున కుపనయనము మాటయున్నది. అడుగవచ్చును. 'శత్రువునకునైన నిచ్చుటయె లెస్స యడిగినయెడ' నని నీవు పద్యము నేర్పితివి కదా.' ఈ నా యాభరణములన్ని యాయన కిచ్చివేయుము.' అని తీసి యిచ్చెను. హరిశ్చంద్రుఁడు వానిని విశ్వామిత్రున కిచ్చెను. విశ్వామిత్రుఁ డాశ్చర్యపడి సింహము కడుపునఁ గుందేలు పుట్టునాయని యనుకొనుచు మీ రింకఁబొండని తాను సత్యకీర్తినిజూచి నీవు పోయి యథాప్రకారము రాజ్యకార్యములు నిర్వర్తించుచుండుము. నేను తేపు వచ్చెదనని చెప్పఁగా హరి శ్చంద్రుని విడిచి యతఁడు పోలేక యేడ్చుచుఁ బోయెను. విశ్వామిత్రుఁడు పదియడుగులు పోయి గిఱ్ఱున తిరిగి 'హరిశ్చంద్రా! అప్పులకాఁపా!నిలునిలు నా ఋణము తీర్పకయే పోయెదవా ' యని యఱచుచు మార్గ మున కడ్డమువచ్చి నిలఁబడెను.

హరి– నే నెప్పుడు మీయొద్ద నప్పు తీసికొంటిని ?

విశ్వా– యజ్ఞమునకై నీవు నాకిచ్చిన ధనరాశి నీయొద్దనే యుంచలేదా ? అది యెగురఁగొట్టి పోఁ దలఁచితివా? దాని నిప్పుడిమ్ము.

హరి– రాజ్యమంతయు మీకే యిచ్చితిని గదా.

విశ్వా– బ్రహ్మాదాయము దేవాదాయము విడఁదీసినట్టు దానిని విడిచి రాజ్యము నిచ్చితివా ?

www.mohanpublications.com

హరి– లేదు.

విశ్వా– నీవు దానిని వేఱుగ నెత్తి యుంచితి వనుకొంటిని. నమ్మినవానిని మోసము చేసెదవా? నీవేమో రాజువు గొప్పవాఁడవని తలంచి నీయొద్ద దాఁచియుంచఁగా నిప్పుడు మొదలు ముంపఁ జూచెదవా? ఒకమాట చెప్పుము. ఇచ్చెదవా కల్లలాడితి ననెదవా? అప్పుడు చంద్రమతి నాథా! ఈయన యుద్దేశము మన కుమారుఁడు చెప్పినదే. సందేహము లేదు. ఎటులైన మిమ్ము బొంకింపఁదలఁచి యిన్ని పోకలఁ బోవుచున్నాఁడు ఇఁక వాదముతోఁ బనిలేదు. ఇంతగాక మఱేమి యీయన చేయఁగలఁడు? గడువు తీసికొనుఁడు. ఆలోపల నెందైన సంపాదించి యిత్తురుగాక. అని చెప్పఁగా హరిశ్చంద్రుఁడు 'ఋషీశ్వరా ! ఒక నెల గడువిందు సంపాదించి యిచ్చెదను.' అనఁగా, నీవీయ లేకున్న నే నేమి చేయవలయునని విశ్వామిత్రుఁ డడిగెను. మాసము లోపల నే నీయకున్న నన్నెవ్వరికైన నమ్మి మీ ధనము రాఁబట్టుకొనుఁడని హరిశ్చంద్రుఁడు చెప్పెను. విశ్వామిత్రుఁ డామాట విని హరిశ్చంద్రా ! నీవు నా రాజ్యములో నెందైనఁ బల్లెలయందుఁగాని పట్టనములందుఁ గాని నిలువరాదు. నా రాజ్యములోఁ దిరిపె మెత్తరాదు సుమా యనెను. దేవబ్రాహ్మణక్షేత్రములు మీవి కావు. వానియందెందైన సంపాదించి యిచ్చెదనని రాజు చెప్పఁగా 'మంచిది. అంగీకరించితిని. నీవు దరిద్రుఁడవు. ఎప్పుడు దొరకిన దప్పుడే తిందువు. అటైన నా పైకము వచ్చుమార్గము లేదు. వీఁడు నా శిష్యుఁడు నక్షత్రకుఁడను వాఁడు. నా కడుపునఁ బుట్టిన బిడ్డకంటె వీఁడు నాకు మిక్కిలి యిష్టుఁడు. ఆఁకలిదప్పుల కోర్చెడువాఁడు గాఁడు. నిద్ర మేలుకొనలేఁడు. మిక్కిలి సుకుమారుఁడు. వీనిని నీవెంటఁబంపెదను. వచ్చినధనమంతయు వీని యొద్ద నిచ్చుచుండుము. నెల దాఁటెనావీఁడు మిమ్మునమ్మి వేయఁగలడు. జాగ్రత్త' యని నక్షత్రకు చెవిలో నేమేమో చెప్పి కూడ నంపెను. హరిశ్చంద్రుఁడు భార్యతోడను గొడుకు తోడను కాశికిఁ బోవుచుండెను.



హరిశ్చంద్రుఁడు నక్షత్రకుని మోసికొనిపోవుట.

**హరిశ్చంద్రుఁ డడవిలోఁ గష్టపడుట.**

హరిశ్చంద్రు డడవులఁబడి పోవుచుండ విశ్వామిత్రుఁడు వారికిఁ గానరాక కూడఁ బోవుచు వారు నడచు త్రో వలందు ముండ్లు గండ్లు, ఏళ్ళు, బీళ్ళు,గుట్టలు,మిట్టలు, వంకలు మండించుచు ననేక విధముల వారిని నెండించుచు నెండల తరువుకాఁడైన నక్షత్రకుఁడు హరిశ్చంద్రునిఁ బెట్టినబాధ యింతంత యనరాదు, పదియడుగులు నడచి నా కాలిలో ముల్లు విఱిగెను. నేను నడవలేను. నన్నె త్తుకొమ్మని బాధించును. అప్పుడు హరిశ్చంద్రుఁడు తన కుమారుని దించి వానిని మోసికొనిపోయెను. చెట్టు చేమ లేనిచోట నయ్యయ్యో ఆఁకలి ఆఁకలి ప్రాణము పోవుచున్నది. మీకు బ్రహ్మహత్యవచ్చును. వచ్చెను. నాకన్నము పెట్టుఁడని పీడించును. బాగుగఁ బండిన పండిచ్చిన లుకలుకలాడు చున్నదని విసరికొట్టును. దోరపండిచ్చినఁ గసుగాయ యిచ్చితివా యని కసరికొట్టును. కోరినపండిచ్చినఁ దిని పాలు తెమ్మనును. చంద్రమతి హరిశ్చంద్రులు ముందుగఁ బోవునట్లుగఁ దాను వెనుకఁ జిక్కి నన్ను వెనుకనుండి పులి వచ్చి యెత్తుకొని పోనిమ్మని మీరు ముందు పోవుచున్నారా యనును. నీవు ముందు పొమ్మన్న రాజ్యములు పోయినను లక్షణములు పోలేదే. మీ సేవకుఁడనా ? యనును.

www.mohanpublications.com

కూడ రమ్మనిన నాతో సమానుండువా యనును. ఎత్తుకొనెద రమ్మనినఁ గ్రిందఁబడవైచి చంపుటకా యనును. మా యిరువురి నడుమ రమ్మనిన నాలుమగల నడుమ వచ్చిన వారి నెడఁబాపినంత మహాపాపమనును. చంద్ర మతి కొడుకు నెత్తుకొని వాడినమోముతో జెమటకాఱు మేనితో నొచ్చిన నరములతోఁ బగలిన పాదములతో నెండిన మోవితో నీటినుండి పాపిన తామరతూఁడువలె వాడి సొక్కుచు సోలుచు నడుగామడగా నడచునపుడు పెండ్లినడకలు నడచెదరేమి త్వరత్వరగా నడుగు సాగనీయుఁడని ముందు ముందు పోయి రా రండని తీవరించును. వారు శీఘ్రముగ నడుచునపుడు తా నీడిగిలఁబడి జనము ముద్దుబిడ్డనై యెత్తు మరగి దొరల చేతినిమ్మపండునై యెండ కన్నెఱుఁగక వానకన్నెఱుఁగక యున్న నే నీ దరిద్రులతోడ నిర్భాగ్యులతోడ వచ్చి నట్టడవులలోఁబడరానిపాట్లు పడవలసి వచ్చెనని వారిని దిట్టును. నాలుక యెండిపోవుచున్నదో యని యఱ చునపుడు నీరము తెత్తునాయని హరిశ్చంద్రుఁడడుగ నీవు రాచవాఁడవు నీ చేతినీరు నేను వ్రేలువేసి తాఁకుదునా యనును. నీటిపట్టునకు నీవు రమ్మన్న నేను నడవలే నను. మఱియొకసారి దప్పి యన్నప్పుడు నేను మోసికొని పోదును వచ్చెదవా యనిన నాకొఱకు దొప్పెఁడు నీళ్ళు తేలేవా యనును. నేను తెచ్చిన నీవు త్రాగ నంటివే యనినఁ బ్రాణమెక్కువా? కులమెక్కువా? ఆపదలచోట నియమకార్యము హూళిక్కి యని తెలియని వాఁడవు రాజ్య మెట్టు లేలితి వనును. ఇట్లు నక్షత్రకుఁడు వారిని పెక్కువిధములఁ గష్టపెట్టెను.

## హరిశ్చంద్రుఁడు బేతాళవటముఁ జేరుట.

ఇంత కష్టపెట్టినను వారు మనస్సులో నొచ్చుకొనలేదు. వారి ధైర్యము చూచి విశ్వామిత్రుఁడు తన కవమానము వచ్చునని భయపడి వీరు చచ్చిరా నా పీడ పోవును. కావున వీరు మరణించు నుపాయమైనఁ జేసెదనని దంతఘాతకుఁడను రాక్షసుని బిలిచి నీవు హరిశ్చంద్రుఁడు పోవుమార్గములో మునివేషము వేసి కొని యుండుమని యేమేమో యుపాయములు చెప్పిపంపెను. రోషము దోష మెఱుఁగదు గదా? వాఁడట్టులే యుండెను. ఇచ్చట నక్షత్రకుఁడు నాకు దప్పి యగుచున్నది. నాలుక యెండిపోవుచున్నది. నీళ్ళు నీళ్లని యఱచి హరిశ్చంద్రునిఁ జూచి విప్రకుమారుఁడు దప్పిచే శోషిల్లియున్నాఁడు. ఎందైన నీళ్లున్న వేమో చూడుఁడు. నే నీయన కుపచారము చేసెదనని చెప్పి యాయనమీఁద నెండపడకుండునట్లు నిలిచి పైఁటకొంగుతో విసరు చుండెను. హరిశ్చంద్రుఁడు నీళ్ల వెదకుచుఁ బోయి మాయామునినిజూచి 'మునీశ్వరా! ఇందెందైన నీరున్నదా! విశ్వామిత్రశిష్యుఁడు ప్రాణాపాయదశలో నున్నాఁ' డనెను. మాయముని హరిశ్చంద్రునట్టే చూచి 'నా తపస్సుచేత నీ వృత్తాంతమంతయు నెఱింగితిని. నీవు హరిశ్చంద్రుఁడను రాజవుకదా?' యని నమ్మికపుట్ట నాతని చరిత్రమంతయుఁ జెప్పి యిదిగో నీ చాయఁ గూఁతవేటుదూరమున నొక పెద్ద మఱ్ఱిచెట్టున్నది. అక్కడ నొక మంచినీళ్ల కొలనున్నది. అచ్చటికిఁ బొండు అని చెప్పెను. హరిశ్చంద్రుఁ డట్టులే యని నక్షత్రకుని మోసికొని భార్యతోను పుత్రునితోను మఱ్ఱివృక్షముఁ జేరి యక్కడఁ గడుపారనీరుద్రావి యాపూఁట కక్కడనే నిలిచెను.

తనవంశపుఁ జక్రవర్తిని నిట్లు ముని బాధించుచున్నాఁడుకదా యని కోపముచేత నెఱ్ఱనాయనా యన్నట్లు సూర్యబింబ మెఱ పాఱెను. మనుమనిదుఃఖము చూడలేక మఱుగునకుఁ బోయెనో యన్నట్టు రవి యస్తమించె. ఈయనను దుఃఖాంధకార మిట్లు ముంచుచున్నదో యన్నట్లు చీఁకట్లు బలిసెను. నడచిన బడలిక చేతఁ బడఁతియుఁ గొడుకును నక్షత్రకుఁడును నిదురించిరి. హరిశ్చంద్రుఁడు మాత్రము మేలుకొని యుండెను.



హరిశ్చంద్రుఁడు దయ్యములను చంపుట

www.mohanpublications.com
అర్ధరాత్రిమువేళ దయ్యము 'న్ని గుంపులు గుంపులుగ నూడల వెంట దిగివచ్చెను. హరిశ్చంద్రుఁడు కోపించి కొన్నిటికి ముక్కులు కొన్నిటికిఁ జెవులు నఱికి పంపెను. ఆ వార్త విని కోపించి యచటి భూతముల కెల్లఁ బెద్ద యగు బేతాళుఁడు యుద్ధమునకు రాఁగాఁ జంద్రహాసముచే రాజు వానిని జంపెను. ఈ బేతాళునిచేత హరిశ్చంద్రుఁడు హతుఁ డగునని విశ్వామిత్రుఁడు నమ్మియుండెను. హరిశ్చంద్రుఁడు చావమికి విశ్వామిత్రుఁడు చాల దుఃఖించి మరలఁ గోపించి కారుమేఘముల నెల్లఁ బంపి కుండలతో కుమ్మరించినట్లు వర్షము కురియించెను. వానకుఁ జలికి గజ గజ వడఁకుచు నట్లే చెట్లక్రింద వారు పడియుండిరి. బల్లున తెల్లవాఱఁగానే హరిశ్చంద్రుఁడు సంధ్యవార్చి మరలఁ బయనించెను.

============

**హరిశ్చంద్రునిఁ జంప విశ్వామిత్రుఁడు కారుచిచ్చు కల్పించుట.**

హరిశ్చంద్రు నెటులైనఁ జంపవలయునని విశ్వామిత్రుడు కారుచిచ్చు కల్పించెను. అది నాలుగుప్రక్కలఁ గ్రమ్ముకొని వీరిమీఁదికి వచ్చుచుండెను. అప్పుడు హరిశ్చంద్రుఁడు నక్షత్రకుని జూచి " అయ్యా విప్రకుమారా! కాలాగ్నివలెఁ గారుచిచ్చు చుట్టుకొని వచ్చుచున్నది. మేము ముప్వురమెట్లైనను మాకు వ్యసనములేదు. నా నిమిత్తమై వచ్చిన నీకుఁ బ్రాణహానియైన నా కా పాపము తప్పదు. తేరకు బ్రహ్మహత్య యేల నా మెడకుఁ జుట్టెదవు. నీవైనఁ దప్పించుకొని పొమ్ము. మే మిందే యుందుము. మేము దావాగ్నికి భస్మము కాక చిక్కితిమా మరల రమ్ము." అని వేఁడుకొనెను. నక్షత్రకుండా మాట విని రేఁచుక్క వలె రేఁగి "దుష్టబుద్ధి ! నీ యాలోచన తెలిసెను లే. నే నటు పొఁగానే మీ రిటు దాఁటుకొని నాకుఁ జిక్క కుండఁ బోయి యప్పు తప్పించుకుందమని యాలోచించితివా ! నామీఁద నీ కెంత పరిపూర్ణకటాక్షము పాపిష్టదయ యయ్యా మహారాజా! నేను ముమ్మాటికిఁ బోను మా వాకిటికుక్కవై పుట్టుదువు. నీవు తప్పించుకో. నన్ను దప్పింపుము. నీవప్పులు తీసి తీసి యెందఱకొంపలో ముంచిన వానివలె నున్నావు. నీ మాయలు నాయెద్దఁ జెల్లవు. కాలికిఁ గాలికిఁ గట్టివేసికొందును. జాగ్రత్త. నే నెవ్వఁడ ననుకొంటివో, నా దెబ్బ యింకను నీకుఁ తెలియదు.

అనినఁ జంద్రమతి నారాయణ నారాయణయని వీనులు మూసికొని తన పతికి వచ్చిన కష్టకాలమునకై వగచి ప్రాణేశ్వరుని జూచి 'వల్లభా ! మీరు విషాదపడి ప్రయోజనములేదు. మతిలేనివానికి హితము రుచించునా? యని పైట చక్కదిద్ది చెక్కుకొని మనస్సు దిటపఱుచుకొని హరిశ్చంద్రునకుఁ బ్రదక్షిణించి నమస్కరించి 'ప్రాణేశ్వరా నాకు సెలవిందు నా దేహ మీయగ్నిహోత్రునికి నాహుతిచేసి మిమ్మెల్లర రక్షించెద' నని యాయన పాదములకు నమస్కరించి నిలిచెను.

ఆమె తెంపుచూచి హరిశ్చంద్రుఁ డాశ్చర్యపడి వ్యసనము పైకొన ' నా ప్రాణ సమానురాలా ! వలదు వలదు. నీవగ్నిలోఁ జొచ్చిన నా గతియేమి? ప్రీతిగల భార్య పోయిన పురుషునికిఁ బ్రపంచమే స్మశానము. నీవు పోయిన నీ బాలుని గతియేమి? నీతోడ మేమిరువుర మగ్నిలోఁ జొరవలసిన వారమే కదా ? నా ప్రాణములకై నీ ప్రాణముల నిచ్చెదవా ? నిందింపదా ? నీ వట్లు చేయఁదగునా ?' యని కన్నీరు కార్చెను. చంద్రమతియు ' నాథా ! మీ కపకీర్తి తెచ్చుపని నేను జేయుదునా ? మీరు నన్నాయుష్మతిగ దీవించి పంపుఁడు? సత్యనిష్ఠుల వాక్యము తప్పదు. నన్నుఁ గాపాడుకొని మిమ్మును గాపాడెద' ననెను. దీర్ఘాయుష్మంతురాలా! అట్లైనఁబోయి రమ్ము అని చెప్పఁగా బతికి మరల నమస్కరించి మనస్సునందాయననే స్మరించుచు దావాగ్నిచాయఁబోవుచుండ 'అమ్మానేను' అని లోహితాస్యుఁడు వెంట నంటెను. వాని నెత్తిముద్దాడి సమాధానపఱిచి యిదిగో వచ్చెద నని తండ్రిచేతికిచ్చి పోయి యగ్నిహోత్రునిజూచి 'దేవా! దేవతలు నీ ముఖముననే యాఁకలిదీఱ భుజించు వారు. నీవే యీశుఁడవని వేదములు స్తోత్రము చేయుచున్నవి, నీవు సమస్తపదార్థముల యందంతర్యామి వై యుండువాడవు, నిటాలాక్షుఁడు నీవలనఁ ద్రినేత్రుఁడయ్యె. అట్టి నిన్ను స్తోత్రముచేయ నే నెంతదానననని స్తోత్రముచేసి 'హవ్యవాహనా ! నేను బతివ్రత నైతినేని నా పెనిమిటి సత్యవ్రతము స్థిరముగ సాగునేని నీవు శాంతింపు' మని కేలుమోడ్చి నమస్కరించి యెఱ్ఱతామరవనముఁ జొచ్చు రాజహంసివలె నాకాశమునకు జ్వాలలెగయ చిటచిట పటపటధ్వనితో మండుచున్న మంటలో నిర్భయముగఁ బ్రవేశించెను. వెంటనే కారుచిచ్చంతయుఁజప్పగ చల్లారిపోయెను. ఏమియెఱుఁగనిదానివలెఁ జంద్రమతి పెనిమిటితోఁ గలిసికొనెను. చూచితిరిగదా పతివ్రతల మహిమ.

=============

www.mohanpublications.com



చంద్రమతి అగ్నిని ప్రార్థించుట.
ధ్వనితో మండుచున్న మంటలో నిర్భయముగఁ బ్రవేశించెను.

## విశ్వామిత్రుఁడు చంద్రమతికి దుర్బోధములు చేయించుట.

చంద్రమతిదేవి 'నా పెనిమిటి సత్యవ్రతము స్థిరముగ సాగునేని అగ్ని దేవా! చల్లారుము'అని చెప్పుటయు' దవానల మాటిపోవుటయుఁ గనిన వెంటనే విశ్వామిత్రునకుఁ గడుపులోఁ గొడంత దిగులు చొరఁబడెను. నేను బంపినది సామాన్యమైన యగ్నిహోత్రముకాదు. నా తపస్సు చేతను మంత్రముల చేతను నుద్దీపింపఁజేసిన దహనుఁడు. ఈ రాచదాని పాతివ్రత్యముచే నింతయు వ్యర్థమైపోయెను. ఇఁక నే నేమి వీరిని గెలుచుటేమి? ఉత్తయడియాసగఁ దోఁచుచున్నది. పగయున్న కారణముచే వసిష్ఠుఁ డవునన్నదానిని గాదని వాదించితిని గాని దీర్ఘాలోచనము చేయనైతిని. ఈ వ్యవహారము నందుఁ దప్పక యవమానము నాకుఁ గలుగుననియే తోఁచుచున్నది. ఏమి చేయవచ్చును పట్టినపట్టు వదలరాదు.

కం. ప్రారంభం బొనరింపమి
ధీరతులకు మేలిపథము: తెలిసి తెలియకేన్
బ్రారంభం బొనరించినఁ
భారము నొందించు టొప్పుఁ బ్రాజ్ఞులకెందున్.

ఈ భార్యాభర్త లొకటిగ నుండవఱకు వీరిని జెఱుప బ్రహ్మకైన సాధ్యపడదు. వీరిని చీలఁ దీయ యత్నింపవలయునని యాలోచించి యెవరికిని దెలియకుండునట్లు నక్షత్రకుని చెవిలో నేమియో చెప్పి పోయెను. హరిశ్చంద్రుఁడు భిక్షమునకై పోయియుండునపుడు నక్షత్రకుఁడు "చంద్రమతీ ! నీశక్తి మిక్కిలి యద్భుతము. నీ నడవడికి నేను చాలా సంతోషించితిని. అందు నీవు నా ప్రాణము కాపాడితివి. నీకు మాఱుమేలు చేయ బుద్ధి పుట్టుచున్నది. నేను జెప్పెడు మాట శ్రద్ధతో వినుము. విశ్వామిత్రుని కాళ్ళు గడుపులు పట్టుకొని యైన నేను మీ రాజ్యము నీ కొడుకున కిప్పించెదను. నీ వధ్యక్షురాలవై రాజ్యమేలి సుఖపడుము. నీవు సుకుమా రివి. ఈ హరిశ్చంద్రునితోడ నీవు కష్టపడఁజాలవు. గడువు సమీపించినది ఇప్పటి కొక గవ్వైన నప్పునకుఁగానీ మగఁడిచ్చినవాఁడుకాఁడు. ఇట్టులే యాయన వెంట నవయుచుంటివా తుదకుఁ బట్టుపట్టు మని నిన్ను నీ కుమారుని నెవనికో యొకనికిఁ దెగనమ్మి యప్పుదీర్చి నీమగఁడు తాను సుఖపడు మార్గము చూచుకోఁగలఁడు. మీ కష్టసుఖము లాలోచింపఁడు. కడుపు కుట్టెనవాఁడు కారము దినును. అప్పుచేసినవాఁడమ్ముడు పోయి తీర్చుకొనును. నిన్న డిగి నీమగఁ డప్పుచేసెనా? నీ వేల యతని యప్పునకై దుఃఖపడవలయును? అప్పుచేసి నీకు నీ సుతునకు విషముపోసెను. భరించువాఁడుకదా భర్తయనఁ బడును. ఇట్లడవులలో నీడ్చి కూటికి నీళ్ళకు మొగము వాఁ చనట్లు చేయువాఁడా భర్త? నిన్నుఁ జూచిన నాకెంతో పరితాపము తోఁచి చెప్పుచున్నాను. లెమ్ము అయోధ్యకుఁబోదము రమ్ము' అనెను.

చంద్రమతి యా మాటలకు వీనులు మూసికొని యతఁడు మాటలు చాలింపఁగా నిట్లనియెను. "అయ్యా! నీవు బ్రాహ్మణ కులములోఁ బుట్టితివి. బ్రాహ్మణ గుణమొక్కటియైన నీయందు లేదు. దయగాని, దాక్షి

www.mohanpublications.com
ణ్యముగాని, సత్యమందాసక్తి గాని, ఓర్పుగాని,యేదియు నీయందుఁగానరాదు.నీవు చెప్పినమాటలు బ్రాహ్మణు నోట రావలసినవా ? సతికిఁ బతికంటె దైవముకలదా? వ్రతము కలదా? తపముకలదా? జపము కలదా?

చ. హితమతిఁ బెద్దవారలకు నెప్పుడు మ్రొక్కక
యున్నఁగాని,దేవతల యజింప మానినను,వారి
నియతవ్రతయై నతతోప వాసయై సతిపతి భక్తిఁ
గొల్వమిని,సత్యముగా నిరయంబునం బడున్.

అనుట నీ వెఱుఁగవు. నీవు చెప్పిన గుణములు గల యిల్లాలు నీకు దొరకినప్పుడా సుఖము నెఱుఁ గుదువు.సతికిఁ బతిలేని యిల్లు ముల్లు.పండుగు దండుగు.హారము భారము.జిగులు తెగులు.అర్థము వ్యర్థము.కాయము హేయము పతితోడ నుండు నిల్లాలికి కాడే వీడు.భిక్ష లక్ష.మన్ను జున్ను. సతికిఁ బతి భక్తి ప్రధానముగాని ధనము గాదు.పిచ్చి బాఁపఁడా ! నీ బోధనలు నీచలగు స్త్రీలకుఁ జెప్పఁబొమ్ము.నా పేరే మియో నా పతి పేరేమియో పరస్పర సంబంధ మెట్టిదియో తలంపవైతివి.చంద్రుని బాసి వెన్నెలయుంట నేనాఁడైన వింటివా మఱి కంటివా? ఇఁక నిట్లు మాట లాడక జాగ్రత్త" అనఁగాఁ బతివ్రతలతోడి కోడిగ పు మాటలు నిప్పుతో నాట లనుకొని నక్షత్రకుఁడు "నీ యిష్టమమ్మానాకేమి.నీ మేలుకై చెప్పితిని.ఇష్టము లేకున్నఁ బోనిమ్ము.కోపమేల" యని యూరకుండెను.

=============

## హరిశ్చంద్రుఁడు కాశి చేరుట.

తరువాత వీరు కాశిఁజేరి గంగయందు స్నానముచేసి విశ్వేశ్వరుఁ గేశవు దర్శించి మా కష్టంబులు దీర్పుఁడని ప్రార్థించిరి.అప్పటికి హరిశ్చంద్రుచేత నొక గవ్వయైన లేదు.ధనము వచ్చుమార్గము కనఁబడలేదు. దినము తక్కువగ నెలగడువు పూర్తిమయ్యెను.నక్షత్రకుఁడు మిక్కిలి బాధించియేటుమాటలు పోటుమాట లనసాగెను.అంతటితో సంతుష్టి లేక రొండిలోఁ జేయివేసి నడివీధిలో నిలువఁ బెట్టి "ఓరీ ఋణపాతకుఁ డా ! నేఁటితో గడువు తీఱిపోవుచున్నది.ఉదయము కాఁగానే విశ్వామిత్రుఁడు వచ్చి నక్షత్రకా ! నీవు హరిశ్చంద్రు నివలన రాఁబట్టిన పైకము తెమ్మనిన నే నేమి చెప్పుదును ? యియ్యలేదంటినా నిన్నుఁ గూడఁబంపినది వారి వెంట వేడుకగా వనవిహారము చేయుటకు వయ్యాళి తిరుగుటకా? వారి యక్కఱా ? మన యక్కఱా? యని నన్ను బాత్రుఁడనై విద్యాభివృద్ధి నాశముచేసికొని చెడుదునా? నీ దాక్షిణ్యము నాకేమి ? నెలదినములుగా నీతోడ నాకుఁ పీనుఁగుతోడి జాగారమాయె ? అప్పుభయము నీకుఁ గొంచెముగా నైనాలేక నున్నావు"అని ములుకులవంటి పలుకుల నొప్పించి యడుగు దాఁటనీయక నిలువ వేయుటయు హరిశ్చంద్రుఁ డేమి చేయుటకు దిక్కు దోఁపక నిలఁబడి యుండెను.అప్పుడు చంద్రమతి నక్షత్రకుని జూచి "బ్రాహ్మణకుమారా! ఏల నిష్కారణముగఁ బరుసవుమాట లాడెదవు.నెలనాఁటి కీయకున్న మమ్మమ్మి నీ పైకము తీసికొమ్మని వీరు చెప్పిరి గదా.నేఁడు మే మీయకున్న ఱేపు మమ్మమ్మి నీ పైకము తీసికొని పొమ్ము తక్కినమాట లేల?" యనిన నక్షత్ర కుఁ డదియా మీ యభిప్రాయము.ఏమిరాజా! నీవై యీయవా? యనెను.చంద్రమతి నాథా?

ఆ. "అప్పుతీయరోఁత హరిహరాదులకైన
మొప్పెతోడ మైత్రి మొరలెరోఁత"

యన విన్నాముగదా.ఈయన మనల నమ్మఁ బూను కొనెనా యే మాలమాదిగలకైన నమ్మును.ఆ విక్రయము మనమేచేసి కొనుదము.నన్ను విక్రయించి యీ యప్పువలని ముప్పు తప్పించుకొనుఁడు.తరువాతమీరు పైకము సంపాదించి నన్ను దాస్యమునుండి విడిపించుకొనుఁడు అని చెప్పఁగా హరిశ్చంద్రుఁడు ద బాలున దిగువఁబడి హా పరమేశ్వరా ! హా పరమేశ్వరా ! ఎంతటి కష్ట వాక్యము వినవలసివచ్చెను.ఆలిసంగడిఁ బెట్టి యప్పుతీర్చుకొను పాపాత్ముఁ డెందైనఁగలడా? మానముగల పురుషుఁడు తన ప్రాణముమీఁదికి వచ్చినను భార్య దేహముపై నున్న యాభరణము నంటఁడన నిఁక భార్యనే యమ్మి యప్పు దీర్చి సుఖింపఁ గోరువాఁడు చండాలుఁడు గాక మఱియెవ్వఁడు? ఈ యవమానము దుఃఖపాటు సహింపఁజాలనే నమ్ముడుపోదును.నీవు నీకొడుకు సుఖముగ నుండుఁడు.అప్పుచేసినవాఁడ నేనేకదా? కావునఁ జేసినవాఁ డే యనుభవింపవలయును అనిన విని చంద్రమతి ప్రాణేశ్వరా ! ఇది దుఃఖమోహములచేతఁ జెప్పుమాటలుగానికార్యభారమాలోచించి చెప్పునవిగాఁ దోఁపదు.మీ

www.mohanpublications.com
నిబ్బరము ఆలోచన శక్తి యేమాయె? మన యిరువురు యందుభేదముగలదా? భర్త దేహములో సగము దేహము భార్యదిగదా? మీరు చేసినకార్యము నేనే జేసినట్టుగాదా ? నన్ను విడిచి మీరు చేసిన కార్య మేదైనఁ గలదా? అప్పు మన మిరువురము చేసినవారమే. భర్తకు భార్యయే వేదము చెప్పునుగదా. ఆత్మతో విరోధించి యేకార్యమైనఁ జేసితిరా? లేదు గదా. కావున మీరు చేసినది నేను జేసినది కాదా ? కడియనిన నోరుదెఱచి కళ్ళెమనిన నోరుమూయు గుఱ్ఱమువలె మగఁడు సంపాదించి నన్నినాళ్లు దినుటకే భార్యగాని యిక్కట్టుల నాదుకొనుటకుఁ గాదా? మఱియొకటి యాలోచింపుఁ డు. మీ రమ్ముడు పోయిన నన్ను ఈపుత్రుని భరించువారెవ్వరు? మాకు బ్రతుకు తెరువేది? ఈ చంకబిడ్డ నే నెట్లు భరింతును? మబ్బువిడిచిన యెండ మగనివిడిచిన ముండ యని లోకులాడపేక్షించినట్లు మగనిఁబాసిన మగువను గామదాసులెల్లఁ గోరిపరిభవించుచుందురుగదా? నా శీలము నే నెట్లు కాపాడుకొనఁగలను?మఱియును నే నెట్లు ధనము సంపాదించి మిమ్ము విడిపించుకొనఁగలుగుదును? ఇది మోహమునకు సమయముకాదు. ఈ మోసకాఁడు మనల నెట్టైన బొంకింప నుంకించి యున్నాఁడు. శోకముచేతఁ గాని మోహముచేతఁ గాని లోభముచేతఁ గాని మన మసత్యమాడరాదు. అది మీ రేమఱకుఁడు. అని యనేకరీతులబోధింపఁ దుదకామెను హరిశ్చంద్రుఁడే వీథులవెంటఁ ద్రిప్పి ధనవంతులారా? పుణ్యాత్ములారా అయోధ్య రాజైన నేను విశ్వామిత్రుని ఋణముఁ దీర్ప నా భార్య నమ్ముచున్నాను. కొనుఁడీఁ యని కంట నీరు గాఱనమ్మెను. నక్షత్రకుఁ డదిచూచి "నీ వేడ్చితివా యీయేడుపుఁ గొట్టు తొత్తు మనకేల యని యెవరు కొనరు. మీరెవ్వఁరేడువగూడదు. తీసికొన్న ధన మీ యవలసివచ్చెనే యనియేడుపా? అప్పుతీఱిపోవుచున్న దేయని యేడుపా? ఏలయేడ్చెద" వని యదలించెను.

===================

**హరిశ్చంద్రుఁడు చంద్రమతి నమ్ముట.**

అప్పుడు చూచుచున్న గుంపులోనుండి యొక బ్రాహ్మణుఁడు వచ్చి యేమది యని విచారించెను. అతఁడు బ్రాహ్మణుఁడుకదా యని హరిశ్చంద్రుఁడు నమస్కరించెను. అప్పుడు కాలకౌశికుఁ డను ఆ నీచ బ్రాహ్మణుఁడు హరిశ్చంద్రుఁనిఁ జూచి ' ఓరీ ! రాచవాఁడా! నిన్ను మే మాశీర్వదింపము నీ యందు మాకు సందేహము కలదు. నే నడిగిన ప్రశ్నలకెల్ల సదుత్తరము లిచ్చిన యెడ నీవు కోరిన ధనమిచ్చి నీ భార్యను బానిసగా నేను గొందును' అని చెప్పెను. అయ్యా మీ సందేహ మేమి' యని హరిశ్చంద్రుఁడడిగెను.

కాల- ఈమె యెవతె ?

హరి- నా భార్య.

కాల- సాక్షు లెవరు ?

హరి- ఈ నక్షత్రకునకుఁ దెలియును.

కాల- ఏమయ్యా విప్రోత్తమా ! నీకుఁ దెలియునా?

నక్ష- నాకుఁ దెలియదు. నాభార్య నా భార్య యని యీయన యనఁగా విన్నాను. వివాహము కాఁగా నేను జూడలేదు.

కాల- నీసాక్ష్యము చెడినది. ఇది నీ భార్య గాదు. ఈమె మెడలో మంగళసూత్రము లేదు. కులస్త్రీకూడఁ గాదని తోఁచుచున్నది. నీవు లోకులను మోసము చేయుటకు నెవతెనో టక్కరితొత్తు నెత్తుకొని వచ్చినావు. కానీ, ఎవ రక్కడ రాజభటులారా! యని యఱచెను.

ఈ కాలకౌశికుఁడు పరమదుర్మార్గుఁడు. వీనిని జూచిన ఆ యూరిలో నందఱకుఁ గోపమే. ఆ యూరిలోని వారెందఱో యాదంపతులను జూచినవారున్నారు. ఆమె కులస్త్రీ కాదని వానినోట రాగానే పిల్లవాండ్రందఱు చేరి వాని గోఁచినొకఁడు పీఁకెను. కట్టె వెండ్రుకలు పట్టుకొని యొకఁడు నేలఁబడఁ దన్నెను. మఱియొకఁడు కన్నులలో దుమ్ముకొట్టెను. కొందఱు నలియఁ ద్రొక్కిరి. కొందఱు కాళ్లుపట్టి బఱబఱ యావల కీడ్చిరి. ఈ బాధపడలేక వాఁడు రాజా శరణు అని యఱచెను. అప్పుడు హరిశ్చంద్రుఁడు బాలురకెల్ల సమాధానము చెప్పి వానిని విడిపించెను. అతఁ డేనుఁగు నెక్కి రత్నమును మీటినంత ధనము నిచ్చి చంద్రమతి గొనెను. చంద్రమతియుఁ గన్నుల నిండ నీరుపెట్టి భర్తకుఁ బ్రదక్షిణించి పాదములంటి మ్రొక్కి ప్రాణేశ్వరా ! సెలవా యని యడిగెను. హరిశ్చంద్రుఁడు గ్రుడ్ల నీళ్లు గ్రుక్కికొనుచు దేవీ! ఇన్ని దినాలకు మనలను భగవంతుఁ డెడఁబాపెను. నీవే నాకుఁ బ్రాణమనుకొంటిని. నీవు వెడలి పోవుచున్నావు. ఈ దేహము గతియేమోయని నోట మాటరాక

www.mohanpublications.com

దగ్గుత్తికతో మోమున గుడ్డకొంగు అడ్డముగ నుంచి విలపించెను. నాథా! మీరిట్లాడిన నా ప్రాణ మిచ్చుటనే పోవును. మీరు ధైర్యము వహించి భగవంతునిపై భారముంచి శ్రమించి విశ్వామిత్రుని మాయవలలనుండి తరించి గడ్డ కెక్కుఁడు. ధైర్యము సర్వార్థసాధకము. శోకమువంటి శత్రువు లేదు. మీకు నే నేమి చెప్పఁగల నని దుఃఖింపఁ గాలకౌశికుఁడు మండిపడుచు "ఏమే తొత్తా! నీ విక్కడనే ప్రాణము విడిచెదవా? నీకు బాకి యుండి యంత ధన మిచ్చితి ననుకొంటివా? ఛీ లెమ్ము. నీ మాయలాఁడితనము నాయొద్ద సాగదు. రారమ్ము" అని గద్దింపఁగాఁ జేయునది లేక ఆమె కాలకౌశికుని వెంటఁబోఁజొచ్చెను. అమ్మా నేనే యని లోహితాస్యుఁడు వెంటఁబడెను. హరిశ్చంద్రుఁడు కుమారునిఁ జేరదీసి నాయనా! నాయట్టి నిర్భాగ్యునికిఁ బుట్టిన నీకు నెక్కడి యమ్మ యని యెత్తి లాలించుచుండఁ గాలకౌశికుఁడు మరలి వచ్చి యే మోయి రాజా! వాని నెత్తుకొని ముద్దులాడుచున్నావు. పంపుము నా వెంటనని యఱచెను. నీకు వీని నమ్మలేదు కదాయని హరిశ్చంద్రుఁ డనెను. కాలకౌశికుఁ డామాటవినిఓహో నీవేమో పెద్దమనుష్యుఁడ ననుకొంటినే. తల్లి పిల్ల యనఁగా వినలేదా. తల్లి వెంబడి పిల్లయుండవలెను గాని నీయొద్ద నేల యుండవలయును? దించువానిని" అని బెదరించెను. నీకుఁ బిల్లవానిని నేను విక్రయింపలేదుగనుక నీ నీయనని హరిశ్చంద్రుఁడనెను. అప్పుడు నక్షత్రకుఁ డడ్డమువచ్చి మీ యిరువురకు సమ్మతమైన యెడలఁ బుల్ల ద్రుంచి నా చేఁత నుంచిన నేను మధ్యస్థుఁడుగా నుండి యీ వ్యవహారము పరిష్కరించెదననెను. అట్టులే కానిమ్మని యిరువు రంగీకరించిరి.

అప్పుడు నక్షత్రకుఁ డిట్లు తీర్పు చెప్పెను. హరిశ్చంద్రుఁడు చంద్రమతిని విక్రయించునపుడు కుమారుని పేరు చెప్పలేదు. ఆ కారణముచేత లోహితాస్యుని విక్రయింపనట్టే యెంచవలయును అయినను లోకములో నాచార మావువెంట దూడనిచ్చుచున్నారు. ఆ కారణముచేతను ఆ యాచారమునకు విరుద్ధముగ నా కొడుకును నేను విక్రయింపలేదు. భార్యను మాత్రమే విక్రయించుచున్నానని హరిశ్చంద్రుఁడు చెప్పకపోవుట చేతను లోహితాస్యుఁడు తల్లి వెంట నుండవలసినవాఁడే అనఁగా నయ్యలారా మీరు తగవు పరిష్కరించు విధము దొంగలు దొంగలు కలసి యూళ్ళు పంచుకొన్నట్టున్నది? నిండుగ మునిఁగినవానికిఁ జలి యెక్కడిది?



కాలకౌశికుఁడు చంద్రమతిని దాసిగాఁ గొనుట.

యని రాజు కొడుకును దించి తల్లి వెంటఁ బంపెను. హరిశ్చంద్రుండు చూచుచుండఁగనే పెద్ద కట్టెలమోపు చంద్రమతి తలమీఁదను, గడ్డిమోపు లోహితాస్యుని తలమీఁదను నుంచి కాలకౌశికుఁడు వారిని దనయింటికిఁ బిలుచుకొని పోయెను. కాలకౌశికుఁ డెట్టివాఁడో మీకుఁ దెలిసెను గదా. వాని పెండ్లము పేరు కలహకంఠి. అది యొక సంతగయ్యాళి. వారిరువురును జంద్రమతిని బెట్టిన హింసయింతంతనరాదు. సత్యమునకై యన్ని సహించి యామె వారు చెప్పిన పనులెల్లఁ జేయుచుండెను.

===============

## నక్షత్రకుఁడు హరిశ్చంద్రు నమ్ముట.

ధనమంతయుఁ దీసికొని నక్షత్రకుఁడు హరిశ్చంద్రునిఁ జూచి రాజా! నీవు నిఱుపేదవు గావున నిన్నెక్కువ దెమ్మని పీడించి ప్రయోజనము లేదు. ఉత్తమబ్రాహ్మణుఁడను, అల్పసంతుష్టుఁడను. కావున నీ విపు డిచ్చిన ధనములో మా గురువులవారి యప్పుమొత్తము పైనైనవడ్డి పోఁగా మిగిలినది కొంచెమో గొప్పో నా బత్తెమునకుఁ జెల్లుపెట్టుకొనెదను. రాని వానిచేతి రాయి యన్నట్టు నీవలన వచ్చినదే చాలును. ఇఁక మొదటి మొత్తమున కేమి చెప్పెదవు? ఋణము మీఁద నుండుట బాగుకాదు కదా యనెను. ఆ మాటలు విని హరి

www.mohanpublications.com
శ్చంద్రుఁడు నక్షత్రకునిఁ జూచి "అయ్యా, నీ మాటలు వింతగా నున్నవి. ఎక్కడివడ్డీ? ఎక్కడిబత్తెము? నీకువడ్డీ బత్తె మిచ్చెదనని యెవరు చెప్పిరి? ఏల యీ టాటోటుమాట లనఁగానే నక్షత్రకుఁడు మొగమంతయుఁ గున్నులు చేసికొని యేమి రాజా యిట్లు మాటలాడెదవు? బ్రతికి చెడిన వాఁడవు. నొచ్చియున్నావు. మనము తొందర చెయ్యరాదని పూలలోని తేనెను తుమ్మెద గ్రహించినట్టు నేను మెల్ల మెల్లగా నీకు నొప్పి లేకుండునట్లు కాలెడి కొంపలో వాసము దక్కినట్లని నీ విచ్చినదే చాలునని నేను సంతుష్టిపడి యుండవడ్డీ యెక్కడిది? బత్తె మెక్కడిది? యని చట్టాలు తిరుగ వేసెదవా? నీవు బాగుగ బ్రతికిన కాలములో నిట్టులే తగవులు పరిష్కరించు చుంటివా? వడ్డిలేక యింతపైక మప్పుగ నెవఁడైనా నిచ్చునా? నీ వెంట గుట్ట గుట్ట చెట్టుచెట్టు కానకానకోనకోన కాలు గాలిన పిల్లి వలెఁ దిరిగి యాకు లలములు తిని యెండనక వాననక కష్టపడి నీ వేద్చుచుఁ బెట్టిన తిరిపెపుఁ గూడు తిని బక్క చిక్కి తెల్లపాటి యెముకలు బైటఁబడి చెవులలోఁ బ్రాణములు పెట్టుకొని మా తల్లిదండ్రుల మొగము చూచు భాగ్యము నాకున్నదా యని నే నే కారి చచ్చుచుండఁగాఁ దుదకు బత్తెమే లేదనదవా? నీ వెంట నిన్నాళ్ళు తిరుగుటకు నీ బంట్రౌతు ననుకొంటివా? తరువుకానికి బత్తెము కలదో లేదో నీవే పోయి నలువురిని విచారించి రా పో. ఇందులో నొక కాసైనను విశ్వామిత్రున కీయను. ఆయన చేతనైన నీవలన రాఁబట్టు కొననీ లేకున్నఁ బోఁగొట్టుకొననీ రౌతు మెత్తనయిన గుఱ్ఱము మూఁడుకాళ్ళ నడచిన దన్నట్టు నేను నోరు మెత్తనివాఁడను పిల్లవాఁడనుగదా యని మొండి వాదములతో బెదరించి పంపఁ జూచెదవా? బిచ్చమునకుఁ బోయినను బిగువు తప్ప లేదనుట నీయందే సత్యమైనది. ఈ మాటలు విని యాయనతో మాటలాడుటకే హరిశ్చంద్రుఁడు రోసి నన్నెవ్వరికైన నీ యిష్టము వచ్చినవానికి నమ్మి నీకు రావలసిన ధనము రాఁబట్టుకొనుమని చెప్పెను. అప్పుడు నక్షత్రకుఁడు చెఱకాబెల్లము పెట్టవేయని యడుగు కొనినఁ బెట్టునా? ఈ మాట లప్పుడే చెప్పి యుండరాదా. నాకేల కోపము వచ్చునట్లు చేసెదవని పశువునకు గట్టినట్టు లాయన మెడకొన త్రాడు గట్టి వీథులయందుఁ ద్రిప్పి " మా గురువు విశ్వామిత్రునకు వీఁ డియ్య వలసిన యప్పునకుఁగా వీని నమ్ముచున్నాను ఊడిగపువాఁడు కావలసినవారు కొనుఁడి" యని యమ్మెను. అ ప్పుడు బొగ్గుచాయ దేహము, జుంజుఱు వెండ్రుకల కోర, కొప్పు, ఎఱ్ఱని చింపిఱితలగుడ్డ, మాసినగుడ్డ, కాసె, మొగమున బూడిద, బూఁత, మొలలోఁ గత్తి, మిడిగ్రుడ్లు, కోరమీసము, ఇనుప మాలవాఁడు నేను గొనెదనని వచ్చెను. హరిశ్చంద్రుఁడు నక్షత్రకుని జూచి, "అయ్యా నన్నీ మాలమాదిగల పాలేల చేసెదవు. నీయొద్ద దాఁసుఁ డనై యుందును. నీవు చెప్పినట్లు నడుచు కొనెదను నన్ను క్షమింపుము" అని కాళ్ళపైఁ బడి మ్రొక్కెను. "హరి శ్చంద్రా లే లెమ్ము నేను జెప్పినట్లు నడుచుకొనెదవా" యని నక్షత్రకుఁ డడగ 'నడచుకొనెదను తప్పను' అని చెప్పఁగానే నీ వీ మాలవానికే యమ్ముడు పోవలయును. 'పోయెదవా బొంకెదవా' యనెను. హరిశ్చంద్రుఁడేమి చేయునది లేక యట్టులే కానిమ్మని వానికే యమ్ముడుపోయి యాధనమంతయు నక్షత్రకున కిచ్చి ఋణము తీతినది యాయన నోర ననిపించి పంపెను. అప్పుడు దేవతలు సంతోషించి మాలవాని కొలువునందున్న దినములందాఁకలి దప్పి లేకుండ హరిశ్చంద్రునికి వరమిచ్చిరి.

హరిశ్చంద్రుఁడు "అప్పుమీఁదనుండు వఱకుఁ గొండ నెత్తిన నుంచకొన్నంత బరువుండెను. ఆ దిగులుచేతనే తినిన యన్నముకూడ నొడలికిఁ బట్టకుండెను. మటమట లాడెడు ముఖమును చిటచిటలాడు పలుకులును గల ఋణదాత మొగమెవఁడు చూడఁడో వాఁడే పుణ్యాత్ముఁడు. సుఖారంభము దుఃఖపరిణామ మగునప్పు బుద్ధిమంతుఁ డెవఁడు దీయును? భగవంతుని కృపవలన నేఁటికిఁ దరిఁ జేరితిని" అనుకొను చుండెను.

హరిశ్చంద్రుని కొనిన మాలవానిపేరు వీరబాహువు. వాఁడు వెంటనే మాంసపుఁగావడి భుజముమీఁద ను కల్లుకుండ తలమీఁద నుంచి మోయించుకొని యింటికిఁ దోడుకొనిపోయెను. అచ్చట హరిశ్చంద్రుఁడు మాలవాఁడు పశువులఁ జంపుమనినఁ జంపెను. తోళ్లూఱవేయుమనిన వేసెను. ఎముకలు కుప్పగఁ ద్రోచి యెత్తి పోయుమనినఁబోసెను. ఇట్లెంత నీచమైన పనియైనను ఆఁకలిదప్పులనక యెండవాన యనక, రేయి పగలనక మంచి చెడ్డ యనక పుణ్యాపాపమనక విసువక కినియక మొగము మాడ్చక రోయక మూలుగక అలయక సొలయక ఆలసింపక యతఁడు చెప్పిన పనులన్నియు భక్తి తోను శ్రద్ధతోను జేయుచుండెను. ఇంత చేసినను ఆ మాలవాఁడు దయాదాక్షిణ్యములు లేక విశ్వామిత్రునికి లోపడి హరిశ్చంద్రుని బొంకింప నెన్నెన్ని పాటులో పడెను. ఎటుగాక తుదకు నొకరాత్రి హరిశ్చంద్రుని దన కాళ్లు పిసుకు చుండుమని చెప్పి తాను నిద్దురపోయినఁ జాలించు నేమో చూతమని దొంగ నిద్దుర పోవుచుండెను. ఉదయమగువఱకు నటులే కంటిమీఁద రెప్ప వ్రాల్పక కాళ్లు పిసుకుచుండెను. మాలమాదిగలఁ దాఁకనొల్లని నేను మాలవాని కాళ్లు

www.mohanpublications.com



వీరబాహుఁడు హరిశ్చంద్రుని గొనుట.

పిసుక వలసి వచ్చెఁ గదా యనియెన మనస్సున సంకట పడినవాఁడు కాఁడు. ఆయన నిబ్బరముచూచి యిఁకఁ దనయొద్ద నాయన నుంచు కొనినఁ బ్రయోజనము లేదని వీరబాహుఁడు మఱియొక యుక్తిచేసెను.

===============

## హరిశ్చంద్రుఁడు స్మశానంబునఁ గావుండుట.

ఆ మఱునాఁటి యుదయమున వీర బాహుఁడు హరిశ్చంద్రునిఁ జేరఁ బిలిచి యిట్లునియె. ఓరి బానిసీఁడా ! నీకు నా యందలి భక్తికి, పనియందలి శ్రద్ధకు సంతోషించితిని. ఇఁక నీవు నాసమక్షముననుండి కొలువు చేయవలసిన పనిలేదు. నే నీ యూరి స్మశానము గుత్తకుఁ దీసికొన్నాను. నీవు పోయి యా వల్లకాటియందే కాఁపుర ముండుము. అక్కడకుఁ బీనుఁగులఁ గాల్చుటకుఁ దెచ్చిన వారివలన నొక మాడఁ దీసికొనుచుండుము. కాటిమాడ యీయక పీనుఁగును గాల్పనీయకుము ఆ పీనుఁగుల కిడు పిండమును నీవు తినుచుండుము మాడలెల్ల నాకుఁ దెచ్చి యిచ్చుచుండుము. నీవు వీరదాసుఁడను పేరు వహింపుము పొమ్మని పంపెను. హరిశ్చంద్రుఁడు నట్లుగాక యని స్మశానవాటికిఁ బోయెను. ఇట్లు పోయి యందు నలువంకలు పాఱ చూడఁగా నొకచోట బీనుఁగులు కాలుచుండెను. ఒక ప్రక్కమృతులకై బంధువులు విలపించుచుండిరి. మఱి కొందఱు నెత్తిని ముసుఁగులు వేసికొని కూర్చుండి యుండిరి. అచ్చట నచ్చట పుఱ్ఱెలు పడియుండెను. ఎన్నఁడు చూడని యివి యన్నియుఁ జూడఁగా ఆయనకు మనసులో నొకవిధమైన వికారము కలిగి తనలోఁదానిట్లు మాటలాడుకొనసాగెను.

అయ్యో ! యీస్మశానము సుగుణపతి యగు భార్యను గోలుపోయినవాని సంసారమువలె దుఃఖకరమై యున్నది. ఈ కాష్ఠవహ్ని విశ్వామిత్రుని నాయందలి కోపమువలె భయంకరముగ విజృంభించుచున్నది. నా హృదయంబున దుఃఖమువలె శవధూమము నల్గడల వ్యాపించుచున్నది. పొగచూరిన యీచెట్లు కాంతిఁబాసి ఘోరములై మృతునికై తలలు వ్రేలవైచి దుఃఖించు ఈబంధుల నల్లవాఱిన ముఖములవలె నున్నవి. అయ్యో! ఇన్ని పుఱ్ఱె లిందుఁ బడియున్నవి. ఇవి యెవ్వరివో? ఇప్పు డన్నియు నేకరూపమున నుండుటచే గుర్తింప సాధ్యము కాకున్నవి కదా. ఆహా యమునకు సమవర్తి యనుపే రెంత సార్థకము ! మహారాజైనను, నిఱుపేద యైనను, ధనికుఁడైనను, సుందరుఁడైనను, గురూపియైనను నందఱు నీ స్థితికి రావలసినవారేకదా. వీనియందు నిది మహారాజు పుఱ్ఱెయని యిది దరిద్రుని పుఱ్ఱెయని యిది పండితుని పుఱ్ఱెయని యిది మూడుని పుఱ్ఱెయని గుర్తింప సాధ్యపడునా? ఈ సర్వసమత్వము మఱచి లోకులు భూమిమీఁద నుండు కొలఁది దినములలో నెన్నిపాటులు పడుచున్నారు! ఇందెందఱో కస్తూరివంటివారు. కస్తూరిపోయినను రితరులు లోకమున లేకుందురా? వారి పేరేల లోకమున లేదు. వారు మట్టితోఁ గలసి గనులలోఁ బడియుండు వజ్రములు. కీర్తి యశస్సులకు పూర్వపుణ్యములు ముఖ్యకారణములు. ఇందెందఱు నీరుల్లి కట్టిన పాఁతలో అయ్యో యిదియొక

www.mohanpublications.com

స్త్రీ శవము. గంట రెండు గంటలకు ముందు బాగున్న ఘటమేకదా యిది. ఆ కన్నులే ఆ ముఖమే ఆ పెదువులే ఆకాళ్లే ఆ చేతులే. అప్పు డెన్నెన్ని చిత్రలీలలో యెన్నెన్ని కార్యములోఁజేసి యుండును. ఇవి యిప్పుడేల చూడఘోరముగ నున్నవి ? ఈ చర్మమున నేమి యో విశేష మున్నదని మోసపోయి బుద్ధిహీనులై కామదాసు లెందఱెన్నెన్ని చేయరాని పనులు చేయుచున్నారు. తాను సంపాదించిన ధన మింటియందే నిలిచిపోవును. బంధు వులు స్మశానముదాఁక వచ్చువారు వారువారు,చేసిన పుణ్యపాపములు మాత్రమే వారివెంటఁ బోవుచుండును. అవియే మరల మంచి జన్మమో చెడుజన్మమో కలిగించుచుండును. అని యీ విధముగఁ బలుపలు విధముల నాలోచించుచు నందే యొక మంచె కల్పించుకొని హెచ్చరికతోఁ గాచుచు వీరబాహు నాజ్ఞప్రకారము వర్తిం చుచుండెను.

==============

## లోహితాస్యుఁడు పాముకఱచి చచ్చుట.

ఇట్లొక సంవత్సరము గడచెను. హరిశ్చంద్రుఁడు బొంకలేదు. ఈయనను మఱి యే విధముగ బాధింప వచ్చునా యని విశ్వామిత్రుఁడు మఱియొక యాలోచనము చేసి కాలకౌశికున కేమేమో రహస్యముగఁ జెప్పి పోయెను. ఆ నీచ బ్రాహ్మణుఁ డొకనాఁడు లోహితాస్యునిఁ జూచి "ఓరి సోమరిపిల్లవాఁడా ! నీకుఁ బెట్టుకూడు దండుగుగ నున్నది. నీ తల్లి కూడుతినుచున్నది కొంచెమో గొప్పో కష్టము చేయుచున్నది. నీవు తిండికిఁ జేటుగా నున్నా వేకాని ఏమిపని చేయుచున్నావు ? ఇట్లు లెన్నాళ్లు నిన్ను మేపుదును? అటుచూడు. ఆబ్రాహ్మణ బాలురందఱు దర్భలు సమిధలు ఆకులు తెచ్చుట కడవికిఁ బోవుచున్నారు. వారివెంట నీవు పొమ్ము. పోయి నాకుఁ గావలసిన దర్భలు సమిధలు మఱ్ఱాకులు తెమ్ము. అని బుగ్గలు నులిమి చెప్పెను. లోహితాస్యుఁ డీ మాటలు తల్లికిఁ జెప్పఁగా నయిదుసంవత్సరముల బాలుఁడెక్కడ? అడవికిఁ బోయి దర్భలు ఆకులు సమిధలు తెచ్చుటెక్కడ? అయ్యో ! యీ బ్రాహ్మణున కింతమాత్రము దయలేదాయెఁ గదా ? నా ప్రారబ్ధము చెడ్డదైయుండ నొరుల నననేల? యని దుఃఖించి కుడిభుజమున నొక రక్షకట్టి నాయనా భద్రముగఁ బోయి రమ్మని పంపెను. విశ్వామిత్రుఁడు తక్షకుఁడను సర్పరాజు నొద్దకుఁ బోయి తక్షకా ! నీవు నా కొక యుపకారము చేయవలయునని తన వృత్తాంతమంతయుఁ జెప్పి హరిశ్చంద్రునితోడ నా కన్నివిధముల కష్టములు నష్టములు ప్రాప్తించినవి. జప తపంబు లన్నియుఁ జాలించి యాయనవెంటఁ దిరుగుటకే కాలము సరిపోవుచున్నది. అవ నము ప్రాప్తించునట్లున్నది.

ద్వి " సడిలేని బ్రతుకొక్క క్షణమైనఁ జాలు
సడితోడ మనసేల శతవత్సరములు
నరకీర్తి యుక్తుఁడై వఱలు మానిసికి
మరణమే మే లవమానంబుకంటె."

కావున నీవా యడవిలో ఆ పెద్ద మఱ్ఱిచెట్టు క్రింది పుట్టలో నుండుము. లోహితాస్యు నచటికిఁ బిలుచుకొనివచ్చునట్లు కొందఱు వటువులఁ బంపెద. లోహితాస్యుఁ డచటికి రాఁగానే వాని నీవు కఱచి చంపుము. నీ విషయమునకుఁ గొండలు నీఱగును. ఇఁక రాచకుమారుఁ డెంత. బాలుఁడు చచ్చెనా చంద్రమతి చచ్చును. వీరిరువురు చావఁగా హరిశ్చంద్రుఁడు చచ్చును. అంతటితో నా మనఃపీడ దెగును. అని పంపెను. అతఁడు నట్లులే యని పోయి కాశి యొద్దనుండు నడవిలోని పుట్టలో దాఁగియుండెను. లోహితాస్యుఁడును విప్రబాలురతోపాటు దర్భలు సమిధలు సంగ్రహించి యాకులుకోయుటకై యత్నించి చూడఁగా సమాపమున నొక పెద్ద మఱ్ఱిచెట్టుండెను. ఆ బాలుఁడు చెట్టెక్కలేఁడు. ఆకులు చేతి కందవు. తోడివారు కోసి యియ్యరైరి. కావున లోహితాస్యుఁడు తానే కోయుటకై పూని తోడి బాలకుల ప్రేరణముచే ఆ చెట్టుక్రింద నొక పెద్దపుట్ట యుండఁగా దానిపై నెక్కి యాకులు కోయుచుండెను. వెంటనే యాపుట్టలోపల నుండు తక్షకుఁడు బుస్సని వచ్చి యా బాలుని కఱచెను. ఈ విషము వేఁడిమికిఁ మఱ్ఱిచెట్టు సమూలముగఁ గాలి బూదియై పోయెను. లోహితాస్యుఁ డు కొనయూపిరితో నేలఁబడెనుగాని కాలిపోలేదు. చంద్రమతి కట్టిన రక్షమహిమగదా యిది యని విశ్వామి త్రుఁ డాశ్చర్యపడెను.

రంగన్న- మామా ! యీ తక్షకుఁడేకదా పరీక్షితుని గఱచి చంపినవాఁడు.

తండ్రి- అవును.

ఈ సమాచారము వెంటనే బ్రాహ్మణ కుమారులు చంద్రమతితోడఁ జెప్పిరి. ఆమె హెూ యని యేడ్చి

www.mohanpublications.com
లేక లేక యొక కుమారుని గంటిని. వానికిన్ని పాటులువచ్చునా ? అయ్యో నాకడుపెంత చిచ్చువంటికడుపో. పూర్వ జన్మమున నెంతపాపము చేసితినో. లేకున్న నిట్టి దుఃఖము కలుగునా? కడుపుఁన బుట్టిన బిడ్డను లాలించి బేలించి బుజ్జగించి తల దువ్వి నీళ్లు పోసి కడుపార నన్నము పెట్టి యద్దుముద్దుచూచి సంతోషించు తల్లుల పుణ్యము పుణ్యముగాని పూఁట కొనసారి యింత కుండ కడుగు గంజి అది యఱకడుపునకు వారి పుణ్యమునఁ బోయఁగా మిడుకుచుఁ జూచుచు గ్రుడ్లు నీళ్లు క్రుక్కికొనుచు నడవుల పాలుచేసి పామువాతఁ ద్రోయు తల్లు లును దల్లులా? శిశువుల సౌఖ్యము చెఱుచు నల్లులుగాక ఇఁకనేల నా కీ జన్మము ? వీనివలన నిహసౌఖ్య ము పరసౌఖ్యము రెండును లేవాయె.

చ. తనయులఁ గన్నతల్లులు ముదంబు దొలఁకఁగవారి
ముద్దులన్ : గనుఁగొనఁ గోరు చుండుదురు.
గ్రక్కున నక్కునఁ జేర్చి ముద్దులన్ । ఘనముగ
నింపఁజాతురు జగంబునఁ దత్పరిలబ్ధిఁ బొంగునా:
వనితలు పూర్వజన్మమున వారకయేమి యొనర్చిరో సుతా :

ఉ. చన్ను ల పాలు ద్రావి సరసంబుగ సెజ్జను నాదుపజ్జనీ
వున్న విధంబుఁ గాంచి మది నువ్విళులూరుచుఁజూచుచుందునే
తన్నగ నీదురూపు భవదీయ విలాసముఁ జిన్ని నవ్వులుం
బున్నమ చందురుం దెగడు మోమును మోహము పేర్మిఁ బుత్రకా :

చ. ఫలమేది యేమొకో యుదర భారమె కాక సుతుండు కల్గినం:
బొలుపుగఁ జంకనెత్తుకొని ముద్దులు పెట్టి శిరంబు దువ్వచున్
జెలువుగఁ జన్నొసంగుచును జిన్ని కుమారుని చేష్టలన్ మనం
బలరఁగఁ జూచు పుణ్యమిది యబ్బక యుండిననో కుమారకా.

అని యనేకవిధముల నేడ్చు చుండఁగాఁ గలహకంఠి చూచి యేమే దాసీ! దినము లేదు వారము లేదు ప్రొద్దున లేచి యేడుపుతోనే నీకు సరిపోవుచున్నది. మానిర్భాగ్యుఁడేడుపుఁ గొట్టుదాని దుడ్డ దండుగు పెట్టి వీథిలోఁ బోవుశనైశ్చరుఁడా యింటిలోనికి రమ్మనట్టు బాగుగఁ దెచ్చి పెట్టినాఁడు! దరిద్రురాలా ! నీ యేడుపు గొట్టి యే మునుపు మాకు వచ్చువచ్చుబడి యిప్పుడు నిలిచిపోయినది. మునుపు పదిసేరులపాలు పిదుకు ఆవు లిప్పుడు నాకే చాలక పిదుకుచున్నవి. ఇఁక వాని ముఖాన నే నేమి పోయుదును ? దక్షిణకుఁ బోయినదఱుము చున్నారు. పీఁనుగుల మోయను బిలుచువారే లేదు. నిన్నేమో చంపుచున్నామని యూరంత ఆఱడి బాగుగ దాపరమైతివి. ఇఁక నేడ్చితివా వీథిలోనికి సిగఁబట్టుకొని యీడ్చుకొని పోదునని కసరెను. చంద్ర మతియుఁ గన్నీళ్లు తుడుచుకొనుచు అమ్మా నిష్కారణముగ నేనేల యేడుతును? మీ యింటాయన నా కు మారుని దర్భలకై యడవికి పంపెను. వాఁడు పాముకఱచి చచ్చెనని చెప్పఁగా నది మఱింత పెద్దగొంతుతో ఆఁ హాఁ మా ఇంటివారిమీఁద నేరములు చెప్పెదవా! దర్భలు తీసికొని రమ్మనిన నీ కొడుకు నెవరు పోయి పుట్ట లెక్కుమనిరి! అది పొగరుఁబోతు చేష్టకదా ! వాఁ డేమి చేయును! రెండుపూఁటలు బాగుగఁ గుండెఁడు గంజిద్రావి చియ్యపట్టి మాఱు మసలి తిరుగుచున్నాఁడు. వానిపొగరు వానిని జెఱిచినది. కొడుకు చచ్చినాఁడఁట! కడుపు దుఃఖమున్నదా చూడుమని యఱచెను.

చంద్రమతియు నామెకు నమస్కరించి తల్లీ ! కోపపడుకుము. కడుపుదుఃఖము కలిగించు బిడ్డలఁ గలవారికంటె బిడ్డలు లేని వారే పుణ్యాత్ములు నీవు పుణ్యవంతురాలవు గావుఁన దొలిజన్మంబు నెవరియొద్దకు ఋణము దీసినదానవు కావు. నేనో యెంత పాపాత్మురాలనో ! ఎవరియొద్ద నప్పుతీసి ముంచితినో ఇప్పు డిట్టిదుఃఖ మనుభవింపవలసివచ్చినది. నవ్వుచుఁ జేసిన నేడ్చుచు ననుభవింపవలయును గదా.

ఈ పాపాత్మురాలి యందు దయయుంచి కొడుకునొద్దకు బోయి రానిమ్ము. నా యందు క్షమింపుమని కాళ్లమీఁదఁ బడుటయు మనవికి మచ్చరమా యని తలఁచి "పగటిపూఁటఁ బోవఁగూడదు. రాత్రియయినతరు వాత మమ్ము నిద్దురఁబుచ్చి పోయి పని వేళకుఁ దిరిగిరమ్ము" అని కలహకంఠి చెప్పఁగా నేమిచేయలేక సముద్రము బడబానలమును తనలో దాఁచినట్టు సహింపరాని దుఃఖాన్ని దనలో నణఁచుకొని రేయిఁకాఁగా

www.mohanpublications.com
వారు నిద్రించినపిమ్మటఁ జేత నొక కొఱవి తీసికొని పతిభక్తి యొక్కటె తోడుగా బ్రహ్మచారులు చెప్పిన మార్గ ముఁబట్టి కొడుకు పడియుండు చోటికిఁ బోయెను. అచ్చట నేల వ్రాలిన చంద్రబింబమువలెఁ బడియుండు కొడుకునుజూచి పట్టరాని దుఃఖమున నేడ్చి యేడ్చి, యేడ్చిన నేమి ప్రయోజనమని దిటము దెచ్చుకొని యీ కళేబర మిచట నుండిన నక్కల పాలయికదా పోవును. నేనైన స్మశానమునకుఁ దీసికొనిపోయి దహించెదనని కుమారు నెత్తుకొని స్మశాసనమునకుఁ దీసికొనిపోయి యచట ఆ దేహమునుంచి యందందుఁ బడియుండిన కడకొఱవులఁ దెచ్చి పేర్చి కుమారుని నందుంచి నిప్పు పెట్టఁ జేతులాడక "అయ్యో పుత్రకా ! నీవు నా కడపునఁ బుట్టకయే యుండిన గొడ్డురాలనై యీ పుత్రశోకముచేఁ దపింపక యెట్లో దినములు గడుపుచుందు నుగదా. పుట్టిపుట్టి నాయట్టి నిర్భాగ్యురాలి కడుపున నీవేల పుట్టితివిరా తండ్రీ లోకములో నెందఱు పుణ్యసతులు లేరు. వారి కడుపునఁ నేల పుట్టక పోయితివిరా కొడుకా? నాకుడుపునఁ బుట్టితివి పో నీవేమి సుఖము లనుభవించితివిరా అప్పా ? నిన్ను దాసిపుత్రుఁడని యా దంపతులు పిలువఁగా వినినపుడు నా కడుపులోని మంట యేమని చెప్పుకొందును. అయ్యో! నానిమిత్తముగ నీ వట్టి నిందయైన మోచి నూఱేండ్లు బ్రదుకరాదా! అదియే నా పాలికి బ్రహ్మానందముగా నుండునే. నా కడుపులోఁ జిచ్చు పెట్టి నీవు పోవలయునా? నీ తండ్రి ప్రాణములు నా ప్రాణములు నీయందే కదా యున్నవి. నీవు పోయిన మా కీ దేహములతో నేమి పని ? నీ తండ్రి యెచ్చటనున్నాఁడో, ఏమిగా నున్నాఁడో తెలియ లేదు. ఈ వార్త యాయనకుఁ జెప్పువా రెవరు? నాయనా ! నిన్ను విడిచి బ్రతుకను లేను. చావను లేను. ఎట్లు చత్తును? బ్రాహ్మణుని మోసము చేసినట్టుగునే. నా భర్త యాజ్ఞను మీఱి చరించి నట్టగునే. హా పుత్రా పుత్రా" యని యేడ్చెను.

ఆ ధ్వని విని హరిశ్చంద్రుఁ డలికిపడి యీ యర్ధరాత్రమునం దెవ్వరో పీనుఁగు కాల్చు చున్నారని తటాలున లేచివచ్చి చంద్రమతిని జూచి యెవతెవు నీవు ? నా యుత్తరవు లేక కాటిమాడ యీయక యేల యీ యెటుగానివేళ దొంగవలెఁ బీనుఁగునుగాల్చుచున్నావు? అని మాడయిమ్మని యడుగ "అయ్యా యీ యపర రాత్రము నందిందు నొంటిగ నుండు మీ రెవరు? నేను దరిద్రురాలను. వీఁడు నాకొమరుఁడు. నే నొక బ్రాహ్మణునింట బానిసను. నా పేరంసనారి. నే నెచ్చటనుండి మీకు మాడతెచ్చి యియ్యఁగలను ? ఈ నిర్భాగ్య రాలియందు మీకును జాలిపుట్టదా ? యని కంటికిఁ గడవెఁడు నీరుగాఱ నేడ్చెను. ఆమె యేడ్పు లకు మనసుకరఁగియు సత్యము దప్పరాదని చంద్రమతికి జూచి నీ బిడ్డఁ డెట్లు చచ్చెను? ఈ వేళ నిచ్చటికి నేల తెచ్చితివి ? పగట రారాదా. అప్పుడైన నెవరైన నిచ్చటికి వచ్చినవారు నీయందుఁ గనికరించి యొక మాడ యిత్తురే. అంతియకాని అయ్యో యీ రాతిగుండె వానికా జాలి ?

చ. హరపదపూజకం దొలఁగి యంత్యజుఁ గొల్చి కులాభి మానముల్ ।
సరగున వెచ్చ పెట్టి హరిచందన కీర్తులు వీటిఁ బుచ్చి దు
ష్కరమగు వల్ల కాటి కధికారము వచ్చిన దుష్టబుద్ధికిన్
గరుణ దలంపఁగా నెటులు గల్గఁగ నేర్చునే పుత్రవత్సలా ॥

అనినఁ జంద్రమతి అయ్యా నా గతి నే నేమి చెప్పుకొందును. ఒక బ్రాహ్మణుఁడు నా భర్తను మోసగించి యప్పు నెత్తిపైఁ బెట్టి మా భూములు పుట్రలు నన్ని గుంజుకొని యడవులకు నెట్టి తుద కాయప్పునిమిత్తమై నన్ను విక్రయింపఁ జేయ నేనొక బ్రాహ్మణునింట దాసినై యున్నదానను. అని తన వృత్తాంతమంతయుఁ దెలిపి కడుపులోనుండి పెకలించుకొని వచ్చు దుఃఖమాఁపలేక రాజాధిరాజులు పాదములపైఁ బడి నమస్కరింప రాజ్యప్రదానము చేయు చక్రవర్తి కుమారునికిఁ జేరెఁడు నేలకుఁ గఱవాయెఁగా దైవమా యని యేడ్వ హరిశ్చంద్రుఁ డామె తన భార్యయని సంశయించి 'అంతటి దొడ్డరాజు భార్యవు నీకు మాడకు గతిలేదా ? గతి లేకున్న నే నేమి చేయఁగలను ! నీ మెడలో నుండు మంగళసూత్రమైన నిమ్ము. ఇది కాటిబాఁపఁడగు నా స్వామి వీరబాహువు నాజ్ఞ. నన్నేలినవాని నేను మోసముచేయఁజాల" ననఁగా నా పాతివ్రత్యముచే నా మినుకు నాభర్తకుఁగాక మఱియెవ్వనికి నగపడదు. కావున నీ కష్టదశయందున్న వాఁడు నా పతియే యని నిశ్చయించి యతని పదంబులపై మొదలంట నఱకిన యరఁటిచెట్టువలెఁ బడి "హా ప్రాణేశ్వరా హా హరిశ్చంద్రా! నీ కిట్టి కష్టదశ వచ్చెనా ? రాజ్యములఁ గాచిన చక్రవర్తికి స్మశానము కావవలసి వచ్చెనా ? రాజాధిరాజుల మనవులు వినువానికి దుఃఖనాదములు వివవలసివచ్చెనా ? కొఱవి దయ్యములా నీకుఁ బౌఁజులు పట్టువార లు? దయ్యములా నీకుఁ బరిచారకులు ? వల్లకాడా నీకు రాజ్యము? ఆ పాడుమంచె నీకు సింహాసనమా?

www.mohanpublications.com

నక్కకూఁతలు వీణానాదములా ? ప్రాణనాథా ? ఇదిగోఁ జూడుము. వీఁడె నీ పుత్రుఁడు. మన యిరువురి ప్రాణధనంబులు దాఁచిన బంగారు పెట్టె యిదే. పామువాతఁ బడిన చంద్రునివలెఁ బడియున్నాఁడు” అని వృత్తాంత మంతయుఁ దెల్పఁగా నతఁడు మూర్ఛపోయి పడి తెప్పతిల్లి లేచి యనేకవిధముల నేడుచుచుండఁ దూర్పున వేఁగుచుక్క దోఁచుటయుఁ జంద్రమతి ‘నాథా ! నే విట నుండవలను పడదు. తెల్లవాఱుచున్నది. ప్రాఁచిపనులు చేయఁబోవలయును. జరుగవలసిన యేర్పాటు సెలవిం’డనఁ బ్రేయసీ ! నన్నేమి చెప్పుమనెదవు? మాడయియాక యీ శవమును మనము దహించిన నేను స్వామి ద్రోహము చేసినవాఁడను అసత్యమాడిన వాఁడను నగుదురు. అట్టి పాపమునకు నే నీయకొనఁజాల. నన్నట్టి కార్యమునకుఁ బ్రేరించుటయు నీకుఁ దగదు. కావున నీయింటి బ్రాహ్మణునొద్దకుఁ బోయి యొక మాడకొనిరమ్ము పొమ్మనఁజంద్రమతి యుఁ బతిపాదములకు నమస్కరించి యాయన వ్రతనిష్ఠకు మెచ్చుకొనుచు కుమారు నాయనకు నప్పగించి రాజమార్గంబున నింటికిఁ బోవుచుండెను.

ఇంతలో విశ్వామిత్రుఁడొక రాక్షసుని బిలిచి నీవు మా యారూపమునఁ బోయి కాశిరాజుకొడుకును జంపి యా పిల్లవాని మీఁదనున్న సొమ్ములన్నియుఁ దెచ్చి చంద్రమతియొడిలో వేసిపొమ్మని చెప్పెను. అట్టులే వాఁడును రాజశిశువును జంపి సొమ్ములు తీసికొని చంద్రమతి కెదురాగా వచ్చి “అమ్మా ! చీఁకటిలో నొంటిగఁ బోవుచున్నావు. నీవెవతె” వని యడుగ నామె తన కథయంతయుఁ జెప్పెను. అది విని యా దొంగ “అమ్మా నీవా నా చెల్లెలవే. ఎన్నాళ్లకు నిన్నుఁ జూచితి నమ్మా ! నాయట్టి యన్నయుండఁగా నీవు ఏడ్వకుఁ జూచితి నమ్మా ! పట్టు పట్టు” మని యామె యొడిలోఁ దానుదెచ్చిన యాభరణములన్ని యుంచి దొంగను బట్టుకొనుటకు వచ్చుచున్న రక్షకభటులలోఁ దాను గలసి యిదిగో దొంగ చిక్కె చిక్కెనని యఱచెను. వారందఱు వచ్చి యామెను బట్టుకొని వెంటనే రాజునొద్దకుఁ దీసికొనిపోయి సొత్తులతో దొంగ దొరకె నని చెప్పఁగా శిశుహత్య చేసినది రాక్షసిగాని మనుష్యస్త్రీ గాదు. ఉదయమున దాని మొగము చూచిన మహాపాతకము వచ్చును. వీరబాహున కప్పగించి తల దీయింపుఁడు. ఇదే రాజాజ్ఞయని ముద్రిక నీయఁగా వారు చంద్రమతిని వీరబాహున కప్పగించిరి. స్మశానమందుండువాఁడాపని చేయవలయునని యామెను వీరదాసు నొద్దకు వీరబాహువు పంపెను. వీరదాసుఁ డేకదా హరిశ్చంద్రుఁడు. అతఁడే చంపవలసినట్టు లేర్పడెను. ఇదియంతయు విశ్వామిత్రుని మాయయని యా దంపతులకుఁ దెలియును. తెలిసియేమిచేయవచ్చును ?కోటానఁగోట్లు జనములు చూచుటకు వచ్చిరి. హరిశ్చంద్రుఁడును ఒఱ నుండి కత్తిదూసి పట్టుకొని యేమియుఁ జేయలేక రాతిబొమ్మవలె నిలఁబడెను. ఆయనకుఁ గన్నుల నీరు గాఱచుండెను. తన భర్త దురవస్థఁ జూచి చంద్రమతి యిట్లనియె. ప్రాణేశ్వరా ? యిది మీకు దుఃఖింప సమయముకాదు. సత్యము దప్పనివాఁడవను శాశ్వతకీర్తి గాంచసమయము వచ్చినది. నేనును దుఃఖింప సమయము గాదు. పుట్టినవారు గిట్టుట నిశ్చయము. అందుఁ బతివ్రతయైన స్త్రీకిఁ బతి యుండఁగఁ జచ్చుటకంటె శ్రేయస్కరము వేఱు లేదు. అందు మీచేత నేను బ్రాణము గోలుపోవుటకంటె భాగ్యము గలదా ? అదియునుగాక శిశుహత్య చేసితినని నాయందు నింద స్థాపింపఁబడినది. ముండమోయ వచ్చును గాని నిందమోయ రాదను నొక సామెత స్త్రీలయందు వాడుకకలదు. ఇట్టి నిందతోడ బ్రతుకుటకంటె మరణమే మేలు. కావున సత్యము దలంచి మీ కార్యము మీరు నిర్వహింపుఁడు. శరీరములు నీటిబుగ్గలు. కీర్తి యా కల్పాంత ముండునది. సత్యవ్రతునకు మరల జన్మము లేదు. కావునఁ దుచ్ఛదేహమునకై స్వచ్ఛకీర్తి విడనాడ వచ్చునా ? యన హరిశ్చంద్రుఁడు ధైర్యము తెచ్చుకొని కత్తి యెత్తి చంద్రమతి మెడ గుఱిచూచి జయపరమేశ్వరా యని వేయఁబోఁగా విశ్వామిత్రుఁ డడ్డము వచ్చి కత్తితోడి చేయి పట్టుకొని “హరిశ్చంద్రా! ఇన్ని దినములు నీవు వివేకివని తలంచియుంటి. ఇంతటి నీచబుద్ధివగుట నే నెఱుంగ. ఎట్టి కటిక వాఁడైన స్త్రీవధము చేయునా? నీ రాజ్యముతోడ నీ తెలివియుఁ బోయినట్టున్నది. ఈ నీతి నీ గురువు నేర్పెనా ? చాలుఁ జాలు. స్త్రీవధ మహాపాతకము. అది చేయకుము. ఇప్పుడైన నామాటవిని నాబిడ్డలు మాల కన్యలను బెండ్లాడుము. నీ రాజ్యము నీకిచ్చెద. నీ యాపథనుండి తొలగించెద” ననిన హరిశ్చంద్రుఁడు నవ్వి మునీంద్రా ఇది మీ యప్పునకు సంబంధించిన విషయము కాదుగదా. మీరు చెప్పునది ప్రాఁత పాటేకాని క్రొత్తది కాదుగదా. నేను స్త్రీహత్య చేసిననేమి? నా భార్య శిశుహత్య చేసిన నేమి? మా పాతకము మిమ్ము బాధింపదు గదా. మా పురోహితులు మీరు కారు గదా. సత్యరక్షణముకై చేయు దుష్కృతము దుష్కృతము కాదు. పరుల బలవంతముచేఁ జేయు పాపము చేసినవాని బాధింపదు. చేయించినవాని బాధించును. ఈ కార్యమున నాకత్తి కెంతపాపమో నాకును అంతే మీ మధ్యవర్తితనము మాకు నక్కఱలేదని యాయన చేయి

www.mohanpublications.com


హరిశ్చంద్రుఁడు చంద్రమతిని చంపఁబూనుట.

పట్టి ప్రక్కగ నిలఁబెట్టి కత్తి యెత్తి చంద్రమతి తల తెగవ్రేయనుంకింప నపుడు కాశీవిశ్వనాథుఁడు విశాలాక్షితో నిలు నిలు హరిశ్చంద్రా ! కత్తి వ్రేయకుమని యఱచుచువచ్చి ప్రత్యక్షమై నిలఁబడి హరిశ్చంద్రా ! నీ సత్య వ్రతమునకు దేవతలందఱు సంతోషించిరి. నీ మనశ్శుద్ధి పరీక్షించుటకై విశ్వామిత్రుఁడీ మాయలన్నియుఁ జేసెను. కాలకౌశికుఁడు కలిపురుషుఁడు. నిన్నేలినవాఁడు మాలవాఁడు గాఁడు యముఁడు. ఇది యజ్ఞభూమి స్మశానముగాదు. నీవే గెలిచితివి. విశ్వామిత్రుఁడోడెను. అని చెప్పఁగా హరిశ్చంద్రుఁడు చంద్రమతి వారికి సాఁగిలఁబడి నమస్కరించిరి. విశాలాక్షీదేవి చంద్రమతిని లేవఁదీసి దేవీ ! నీ పాతివ్రత్యము జగత్ప్రసిద్ధము. నీ మంగళసూత్రము నీ శీలము నీ పెనిమిటిని గాపాడెను. నిన్నుఁ జూచిన మిక్కిలి సంతోషమగుచున్నది. వరము కోరుమనఁగా "తల్లీ ! రాజశిశువు బ్రతుకునట్లు వరమి" మ్మనెను. ఆ పలుకులు విని సంతోషించి పార్వతీదేవి యిట్లనియె. "శీలవతీరత్నమా ? నీధర్మబుద్ధికి మెచ్చితిని. నీ కొడుకును బ్రతికింపఁ గోరక రాచబిడ్డను బ్రతికింపఁ గోరితివి. ఇరువురను బ్రతికించితిమి. ఇఁక మీరు సుఖముగ నుండుఁడు. పోయి వచ్చెద" మని పార్వతీ పరమేశ్వరులు మాయమైరి. ఈ మాటలన్ని వినుచున్న విశ్వామిత్రుఁడు సిగ్గుపడి కొంచెము కాలముండి హరిశ్చంద్రునితో నిట్లనియె. హరిశ్చంద్రా ! నీవు గెలిచితివి. సంతోషించితిని. నీ కీర్తి లోకమున శాశ్వతమయ్యెను. నీ రాజ్యమును నీవు మరలఁ గైకొని యథాప్రకారము పాలింపుము. ఋషినైన నాకు రాజ్యమేల ? యనఁగా హరిశ్చంద్రుఁడు నమస్కరించి మీ కృపవలనఁగాదా నాకు శాశ్వత కీర్తి కలిగెను. అద్దమును నిర్మలముగఁ జేయఁగోరువాఁడు దాని మసిపూసి గట్టిగ రుద్దునుగదా. అటుచేయుట యుద్ధము మీఁది కోపముచేతనా? కాదు. కావున మీరు నాకుపకారము చేసితిరి గాని యుపకారముచేయలేదు. రాజ్యము మరల నన్నుఁ గొనుమంటిరి. దత్తాపహార మెట్టి పాపియైనఁ జేయునా ? అదిగాక యా సుఖదుఃఖములు ననుభవించితిని. క్రక్కినకూడు మరల నెవఁడాశించును ? కావున నన్నుఁ బీడింపకుఁడు. మీ యిష్టమువచ్చిన రాజున కిచ్చి యతనిచేఁ బాలింపఁజేయుఁడు. అనఁగానే " నాయిష్టమువచ్చిన రాజవు నీవే. నీవు గైకొనెదవా అసత్యమాడితి ననెదవా" యని విశ్వామిత్రుఁ డడుగఁగా దేవతల సమ్మతి గైకొని రాజ్యమును మరలఁ బాలింప భార్యతోను కుమారు తోడను హరిశ్చంద్రుఁడు తన రాజధానికిఁ బోయెను. విశ్వామిత్రుఁడు తన ప్రతిజ్ఞ ప్రకారము పదునాలుగు మహాయగము లా రాజు భూమిఁ బాలింపఁజేసి పిదప స్వర్గమున నింద్రుని యర్ధసింహాసనమున నుంచెను. అమ్మణ్ణి ! నీ వడిగిన ప్రశ్నమునకు నుత్తరము వచ్చినదా ?

అమ్మణ్ణి- వచ్చినది.

రుక్మిణి- వారి కట్లు చేయ సాధ్యపడెను. మనకు సాధ్యమగునా?

www.mohanpublications.com

తండ్రి- ఏల కాదు. వారనఁగా నెవరు? చంద్రమతి నీవంటి స్త్రీ కాదా. హరిశ్చంద్రుఁడు నీ మగనివంటి పురుషుఁడు కాడా ? వారు మనవంటి మనుష్యులే. నీ మనస్సు నీ స్వాధీనమునం దుంచుకొంటివేని నీవు చంద్రమతివలె నగుదువు. నీ మనస్సు స్వాధీనములో నీ వుంటివేని కలహకంఠివగుదువు. అంతే భేదము.

రుక్మిణి- నే నబద్ధమే యాడ ననుకో. ఎదుటివారు గొప్పవారై యెవరికిఁ దెలియదుగదా యని యబద్ధమాడి నా కవమానమో కీడో కలిగించి రనుకో. అప్పుడు నేనేమి చేయవలయును ? నే నబద్ధమాడరాదా?

తండ్రి- నీ వడిగినది మంచి ప్రశ్నమే. దానికి మంచి చరిత్రయొకటి రేపురాత్రి చెప్పెదను. ఇప్పుడు చాలఁ బ్రొద్దయినది పోయి పడుకొందము. రామా!కృష్ణా! మీ లో నక్షత్రకుఁ డెవఁడురా ?

రాముఁడు- కృష్ణుఁడు.

కృష్ణుఁడు- నేను గాను, రాముఁడే.

రాముఁడు- నేనుగాదు. కృష్ణుఁడే.

తండ్రి- మీరేలకారు !

కృష్ణుఁడు- నక్షత్రకుఁడు దుర్మార్గుఁడు.

తండ్రి- అయిన మీ రెవరివలెఁ గాఁ గోరెదరు.

రాముఁడు- హరిశ్చంద్రునివలె.

కృష్ణుఁడు- నేను హరిశ్చంద్రునివలె.

తండ్రి- పరమ సంతోషము ఇంకఁ బండుకొని నిద్రపొందు

రుక్మిణి- ఈ కథలు నీకెవ్వరు చెప్పిరి ?

తండ్రి- నేను బుస్తకములందుఁ జదివి నేర్చుకొంటిని.

రుక్మిణి- ఏ పుస్తకములందు !

తండ్రి- గౌరవ ద్విపదహరిశ్చంద్రోపాఖ్యానము. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము. వానియందు నింకను బాగుగఁ జెప్పఁబడి యున్నది.

రుక్మిణి- మేము చదువవచ్చునా ?

తండ్రి- మీకు శ్రద్ధయుండినఁ జదువవచ్చును.

అమ్మణ్ణి, రుక్మిణి- రేపు చదివెదము.

రుక్మిణి- ఈ కథను సంబంధించిన గుర్తులు కాశియం దేవైనఁ గలవా?

తండ్రి- వీరబాహుని యిల్లు ఇప్పటికి హరిశ్చంద్ర ఘట్టము నందు నున్నది. వాని సంతతివారే యిప్పటికి కాటిమాడ తీసికొనుచున్నారు. హరిశ్చంద్రుఁడు కావలియున్న ప్రదేశము నిప్పటికి హరిశ్చంద్ర ఘట్టమందురు. కాలకౌశికుని మేడ యిల్లు కాశిలో చౌకులో నున్నది. ఈ యిండ్లను హరిశ్చంద్రుఁడు భార్య నమ్మిన వీథిని చూచినపుడు ఆహా ! యొక యసత్యమాడ వెఱచి హరిశ్చంద్రునివంటి చక్రవర్తి యెన్ని కష్ట ములపాలాయెను. ఇప్పటివారికి అసత్యమాడుట నిత్యకృత్యమాయెను గదా. అయ్యో ! చంద్రమతి మగనికొఱకై యెన్ని యిడుమలకు లోనయ్యెను. ఇప్పటి సవనాగరిక స్త్రీలైన మగని మఱియేమి చేసియుందురో కదా. కలి మహిమ మనదేశ మెట్టి స్థితికి వచ్చినదని నాకు కడుపులో మిక్కిలి వేదన గలిగెను.

**ఈ చరిత్రమునందువచ్చు స్త్రీ పురుషుల నామములు.**

పు రు ష లు.

| | |
|---|---|
| ఇంద్రుఁడు.<br>దేవేంద్రుఁడు.<br>మహేంద్రుడు. | దేవతలకు రాజు. |
| విశ్వామిత్రుఁడు.<br>కౌశికుఁడు.<br>గాధేయుఁడు.<br>గాధినందనుఁడు. | హరిశ్చంద్రుని నసత్య మాడించెదనని పూనిన ఋషి. |

www.mohanpublications.com
హరిశ్చంద్రుఁడు - అయోధ్యాపట్టనము రాజు. సూర్యవంశమునఁ బుట్టిన వాఁడు మొదటి చక్రవర్తి.
లోహితాస్యుఁడు - హరిశ్చంద్రుని కుమారుడు.
దంతఘూతకుఁడు - హరిశ్చంద్రుని బేతాళపటము నొద్దకుఁ బంపిన మాయాముని.
వసిష్ఠుఁడు - హరిశ్చంద్రుని గురువు అరుంధతి మగఁడు
త్రిశంకుఁడు - హరిశ్చంద్రుని తండ్రి.
నక్షత్రకుఁడు - విశ్వామిత్రుని శిష్యుఁడు. హరిశ్చంద్రునిమీఁది తరువుకాఁడు.
సత్యకీర్తి - హరిశ్చంద్రుని మంత్రి.
కాలకౌశికుఁడు - చంద్రమతిని బానిసఁ గొనిన బ్రాహ్మణుఁడు. కలి పురుషుఁడే యీ బ్రాహ్మణుఁడు
వీరబాహువు - హరిశ్చంద్రుని గొనిన మాలవాఁడు. యమధర్మరాజే యీ మాలవాఁడు.
వీరదాసుఁడు - హరిశ్చంద్రునకు వీరబాహు విచ్చిన పేరు.

స్త్రీలు.

చంద్రమతి - హరిశ్చంద్రుని భార్య.
అంసవారి | చంద్రమతి బాసినగా నున్నప్పటి పేరు.
హంసవారి
కలహకంఠి - కాలకౌశికుని భార్య.

**పొరపాటలు.** టీక.

9 ఆకాశ పుష్పములు = లోకమున లేనివి. ఆకాశమున పుష్పములు లేనట్టు ఆ రాజ్యమున పాపాత్ములు లేరని యర్థము. కుందేటికొమ్ము = లోకమున లేనిది. కుందేలు కొమ్ములుగల జంతువుకాదు. బంగారుచిలుము= మంచి బంగారునకు చిలుము పట్టదు.

11 సత్కులజులు = మంచికులమునఁ బుట్టినవారు. ప్రథితకులంబు = ప్రసిద్ధి కెక్కిన కులము. పథ్యము= అప్పటికి ఇంపుగాకున్నను మీఁద మేలిచ్చునది.

18 ఒత్తుగన్ = మిక్కిలి. మడుఁగు టోగిరము- మడుఁగు = పరిశుద్ధమైన, ఓగిరము = అన్నము. ఘృతము = నెయ్యి. వధూ = స్త్రీ. సత్తు = సత్యము. పాడియే = న్యాయమా.

19 పల్లటపులు = పనికిమాలిన మాటలు.

22 గాధేయా = గాధియను రాజుకొడుకా.

23 తగరు = పొట్టేలు.

27 మహాయుగము = కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అను నాలుగు యుగములు కలిసిన కాలము. మన్వంతరము -౭౧దివ్యయుగములు.

37 వేఁటరులు = వేఁటాడువారు.

38 సప్తవ్యసనములు. 1. స్త్రీలయం దతిమోహము. 2. జూదము. 3. సారాయము త్రాగుట. 4. వేఁట. 5. నోటి దుడుసుతనము. 6. మతిమించి వెచ్చముసేయుట. 7. నేరమునకు మించినశిక్ష సేయుట వీనిలో నేదైనను మనుష్యునికి కీడుచేయును.

40 అదృశ్యము = కనఁబడకపోవుట.

43 కర్తవ్యము = చేయ యోగ్యమైనది.

46 స్మశానపుష్పములు = ఉపయోగింప యోగ్యము కానివి.

51 అపాదమస్తకము = కాలు మొదలు తలవఱకు.

60 తథాస్తు = అట్టుట అగుఁగాక.

129 ప్రారబ్దము = జీవించియుండఁగా ననుభవింపవలసిన పుణ్యముగాని పాపముగాని. సడి =నింద

భాషావిషయము.

తండ్రి- రుక్మిణమ్మా ! హరిశ్చంద్రోపాఖ్యానము చదివెదనంటివే చదివితివా ?
రుక్మిణి- చదువుచున్నాను. కొంత అర్థమైనది కొంత అర్థము కాలేదు.
తండ్రి- అర్థమైన దేది ? అర్థము కాని దేది ?

www.mohanpublications.com

రుక్మిణి- మాటల కర్థము తెలిసినచోట కథ అర్థమైనది.మాటల కర్థము తెలియనిచోట కథ తెలియలేదు.

తండ్రి- నీవు చెప్పినది నిజము. తెలియని మాటల కర్థము తెలిసికొనుము.కథ అంతయు అర్థమగును.

రుక్మిణి- ఎన్ని మాటలని నేర్చుకొందును ?

తండ్రి- నీకు దెలిసినమాట లెక్కువగును తెలియనిమాటలు తక్కువగనుండు పుస్తకము మొదట చదువుము.అర్థము తెలియనిమాటల నన్నిటిని వేఱేపుస్తకములో గుర్తువ్రాసి యుంచుకో,ఆ మాటల కర్థము నన్ను అడుగు ఈ ప్రకారము దినమునకు పది క్రొత్తమాటల కర్థము తెలిసికో.

రుక్మిణి- ఎన్నిళ్ళని అట్లు నేర్చుకొందును.

తండ్రి- సంవత్సరమున కెన్ని దినములు ?

రుక్మిణి- ౩౬౫

తండ్రి- దినమునకు పది మాటలవంతున సంవత్సరమున కెన్ని మాటలు ?

రుక్మిణ- ౩౬౫౦.

తండ్రి- మూడు సంవత్సరముల కెన్ని ?

రుక్మిణి- ౧౦,౯౫౦.

తండ్రి- మూఁడేండ్లలోపల ౧౧,౦౦౦ క్రొత్తమాటల యర్థము నీకుఁ దెలిసిన యెడల నీకర్థము కాని పుస్తకముండునా ?

రుక్మిణి- ఉండదు.

తండ్రి- ఏడవయేఁట నీవు దినమున పది మాటల యర్థము నేర్చుకొనుటకుఁ బ్రారంభించినను తొమ్మిదవ సంవత్సరము వెళ్ళకముందే యన్ని మాటల కర్థము చెప్పఁగలిగి యుందువుకదా.

రుక్మిణి- ఉందును.నా కింకొన సందేహము న్నది దానికేమి చెప్పెదవు ? చెప్పెను అను మాట యున్నదనుకో.అది యొకచోట చెప్పెను అని,మఱియొకచోట జెప్పెను అని మఱియొక చోట సెప్పెను.అని యున్నది.అట్లెందుకుండవలెను ? ఇటువంటివి మఱికొన్ని యున్నవి.వాని నన్నిటి నడుగుదును జెప్పెదవా.

తండ్రి- అవశ్యము చెప్పెదను.ఒకమాటే యొకచోట నొక విధముగా మఱియొకచోట మరియొక విధముగా నున్నదని గుర్తించితివే నీ విమర్శకే చాల సంతోషించినాను.నీవేమి యడిగినను చెప్పెదను.

రుక్మిణి- నాకుఁగల సందేహములనెల్ల గుర్తు వ్రాసికొని రేపుపగ లడిగెదను.

తండ్రి- అట్టులే కానిమ్ము.

ఉ.పుట్టినె భూమియం దొక యపూజ్యుఁడు నా కిది మాతృభాషనేఁ<br>
బుట్టినదేశ మిద్ది యని పొంగక ప్రాణము గల్గు పీనుఁగై ।<br>
పుట్టవె మాతృగర్భముగఁ బుర్వు మఱేవియొ వానిలోన నీ ।<br>
కట్టిఁడి నెంచ నొక్క టగుఁ గాక నరుండని యెంచదోషమౌ .

